# జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| జ్యోతిష ప్రథమ బోధిని | 0 | 8 |
| జాతకమార్తాండము 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| డిటో 3 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష రహస్యము 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | |
| సంజ్ఞాధ్యాయము 1 వ భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము 2 వ భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము 3 వ భా॥ | 3 | 0 |
| ద్వాదశభావఫలము 4 వ భా॥ | 3 | 0 |
| ముహూర్తసింధువు వా. సూ. | 3 | 8 |
| షడ్వర్గబలము డిటో | 0 | 8 |
| [illegible] దీపిక | 0 | 12 |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | 0 |
| జ్యోతిష ఫలప్రదర్శి | 0 | 12 |
| పుట్టుమచ్చల శాస్త్రము | 0 | 12 |
| అష్టకవర్గు | 0 | 12 |
| జలార్గళశాస్త్రము | 0 | 6 |
| ఛప్పన్నము (ప్రశ్న [illegible] | 0 | 6 |
| సంఖ్యాశాస్త్రము | 1 | 0 |
| జాతకచంద్రిక [illegible] | 0 | 12 |
| జాతకదర్పణము | 0 | 12 |
| హ [illegible] | 3 | 0 |
| ఆంధ్ర [illegible] | | |
| [illegible] | 1 | |
| [illegible] | 1 | |
| గోచా [illegible] | [illegible] | 12 |
| కాలామృతము | 1 | 8 |

| | | |
|---|---|---|
| శిల్పసంగ్రహము | 0 | 6 |
| ఆయుర్దాయయోగము | 1 | 0 |
| ముహూర్తదర్పణము | 1 | 0 |
| రెట్టమతశాస్త్రము 60 సంవత్సరముల పంచాంగము | 1 | 0 |
| జ్యోతిషఫలగ్రంథము | 0 | 4 |
| స్వప్నఫలదీపిక | 0 | 8 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము తాత్పర్య సహితము | 0 | 12 |
| సమ్మోహనశాస్త్రము అను అదృష్టయోగము (మెస్మరిజమ్ అండ్ హిప్నాటిజమ్) | 1 | 8 |
| సకల సమస్తగుణ అదృష్టదీపిక | 1 | 0 |
| [illegible] | 0 | 8 |
| [illegible] ధ్యాయము | 0 | 8 |
| [illegible] శాస్త్రము | 0 | 8 |
| [illegible] సాముద్రికము | 1 | 0 |
| జాతకపారిజాతము | 1 | 0 |
| జాతకరాజీయము | 1 | 0 |
| [illegible] శాస్త్రము | 0 | 4 |
| నవగ్రహచింతామణి | 0 | 4 |
| స్త్రీ ఋతుశాస్త్రము అను రజస్వలాజాతకము | 0 | 12 |
| [illegible] | 0 | 8 |
| [illegible] | 0 | 4 |
| [illegible] | 1 | 0 |
| [illegible] | 0 | 8 |
| [illegible] | 0 | 8 |
| మూల స్తంభం (శైవగ్రంథం) | 1 | 0 |
| సోమనాథ రేఖాశాస్త్రము | 0 | 12 |

---

# కృష్ణలీలనాటకము

## (ఐదంకములు)

ఇయ్యది

లవకుశ. భక్తకుచేల, నాటకములు రచించిన

బళ్ళారి

పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రులు గారిచే

రచియింపఁబడినది





పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1959

  [వెల రు 1—8—

# హెచ్చరిక

ఈ "కృష్ణలీల" నాటకము యొక్క కాపీరైటు సర్వహక్కులు మాకు చెందియున్నవి. కావున మా వ్రాత మూలకమైన పర్మిషను లేనిదే యేసంఘముగాని, యేసినీమా నటులుగాని, ప్రదర్శింపరాదు. మఱియు గ్రామఫోనురికార్డింగ్, టాకీస్క్రీనింగు, యితరభాషలలోనికి తర్జుమాలు వగైరాలు చేయకూడదు. అట్లు అతిక్రమించినవారలు మేము జరుపు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందు మూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,
రాజమండ్రి.

---

శ్రీగోపాలకృష్ణాయనమః

# నాంది

శ్రీరాజిల్ల యశోదయంకమున వాసింగాంచి కంసాదులన్
పేరారంగను జేసి పార్థసఖుఁడై వేదాంతతత్త్వంబు నే
పారన్ దెల్పుచు గోపకాంతలకు నిత్యామోదసంధానుఁడౌ
నీరేజాక్షుఁడు గోపబాలుఁ డొసఁగున్ నిత్యాయురైశ్వర్యముల్.

శ్రీ

# కృష్ణలీల నాటకము

## ప్రథమాంకము

1 వ రంగము : క్షీరసాగరము

[విష్ణువు పరుండియుండును-ఇరు ప్రక్కల బ్రహ్మాది దేవతలు నిలిచి స్తుతించుచుందురు]

అనుబంధము 1

విష్ణు—కమలాసనా! దేవనాథా! మీ కందఱికిని కుశలమా? స్వర్గ రాజ్య మే యంతరాయమును లేక పాలింపఁబడుచున్నదా? నీవజ్రధార దానవుల శిక్షించుటయం దజాగ్రతఁ బొంది యుండదుగదా? బృహస్పతి యుపదేశము నీ కామోదము నిచ్చు చున్నదా? రాకరాక మీరందఱు నిచ్చటికి వచ్చుట యేదో యొక విశేషమును సూచించుచున్నది.

మ. సురలారా! కుశలంబె మీకు, శుభమే చుట్టాలకున్, సేమమే
తరుణీవారములున్, ప్రమోదులెసుతుల్, దైత్యుల్ నిరోధింపరే
అరుదయ్యెన్గద మీరు వచ్చుట మనోహ్లాదంబుచేకూరె భా
సురవాంఛన్వచియింపుఁ డిచ్చెద మనస్స్ఫూర్తిన్ వరాబ్జాసనా!

సీ స మా లి క

విష్ణు—ధరణీసురాద త్త వర హావిర్భాగముల్
కొనుచు మోదింతురే యనఘులార ?

బ్రహ్మ—క్రతువు లుండినగదా క్రతుభాగములు గల్గు
క్రతువులు నీటిలో హుతము లయ్యె,

విష్ణు—ఏకోర్కికై మీర లిచటికే తెంచితి
రెలమి శంకింపక తెలుపుఁ డయ్య,

ఇంద్ర—నిన్నుఁ జూచుటకంటె నున్నదే వేరొక్క
కోరిక మా కెందు నీరజాక్ష ?

విష్ణు—ఎంత ప్రార్థించిన నేగుదేరని మీర
రరుదేర నాశ్చర్య మమరె నాకు,

నార—ఆశ్చర్య మంతయు నమరు నీయందె నీ
వెఱుగని యాశ్చర్య మేమి కలదు ?

విష్ణు—పురుహూత ! వేదము మోక్షమైనను నిత్తు
మీ భక్తి మదినాకు మెప్పు నించె

మీ స్తుతిజాలముల్ మీదు మిక్కిలి నన్ను
నలరించెగా నేఁడు అమరులార !

నారదు—గీ. అధిప మోక్షము నింద్రుని కపుడె కలిగె.

విష్ణు—ఎట్లు నీమాట నారదా ?

నార—యేమిచెప్ప.

తనర నా కంస శిశుపాల దంతవక్త్రు
లిచ్చిరి కపాలమోక్షంబు నిందిరేశ !

బ్రహ్మ—దేవా ! దేవర పరిపూర్ణానుగ్రహమున మమ్ముల నెపుడు పాలించుచుంట మాకశుభ మెక్కడినుండి రాఁగలదు? అయి నను భూలోకమున కంసాది రాక్షసులు పెల్లుపెరిగి చెలరేగి గో బ్రాహ్మణుల హింసించుచున్నవారు. అందువలన యజ్ఞ

యాగాది క్రతువు లొక్కటియు లేక మే మందరము హవిర్భాగంబులు లేక యున్నవారము.

భూదేవి—దేవా! నీయాజ్ఞచే నేను సకలపర్వతసరిత్సముద్రముల వహించుచున్న దానగాని యీదుష్ట కంసాది మహాపాపులను వహింపఁజాలను. లోకనాథుఁడ వగు నీవే యిట్లు కన్నులు మూసికొనియున్న నింకెవ్వరి శరణొందువారము.

అనుబంధము 2

దేవేం—రమారమణా! ఈ పితామహుఁడును, నీభూదేవియు నిటుల నెనలేని చింతలపాలై యుండ నింక నాగతి యేమని విన్నవించువాఁడను? కంస, శిశుపాల, దంతవక్త్రాదు లెల్లప్పుడును నాదేవపురిపై దండెత్తుటకై యెంతయు నాలోచించుచున్నవారు. అందునుకంసుఁడను రక్కసుఁడు ప్రపంచమునంతయు బాధించుచున్నవాఁడు. వానిదాడికివెఱచి యహోరాత్రములు వజ్రాయుధము చేనుంచుకొని కనురెప్పవలె నాలోకమును రక్షించుకొనుచున్నవాఁడ. దేవా! నీ వీ యిడుముల బాపకున్న మాకు మనుగడ కలుగదు. ఇందుకై యీ కమలాసనుని వేఁడి యతనిఁబురస్కరించుకొని నిను శరణొంద వచ్చియున్నారము. అలనాఁడు హిరణ్యకశిపు రావణాదుల బొలియించి మమ్ము గాపాడిన నీదయారసము మాపైఁ బ్రసరింపఁజేయుము. నీవుగాకున్న మ మ్మెవరింక గాపాడుదురు?

చ కనులకు నిద్రరాదు భయకంపితమానస మూరడిల్లఁ దా
ఘనసుర రాజ్యసౌఖ్యములు కానఁగరావట యజ్ఞభాగముల్
వినుటకునైన లేవు బలువేడుక లేదు రమాపతీ! జగం
బనయము కంసురాయిడికి నక్కట చిక్కె దలంచిప్రోవవే.

విష్ణు—పురందర శతానందులారా! భూదేవి! యూరడిల్లుఁడు. నేనిది వఱకే యాలోచించి యున్నవాఁడను. నారదునివలన

వృత్తాంతములనెల్ల నెఱింగి యున్నవాడను. నాభక్తులై భూలోకమున నుదయించిన దేవకీవసుదేవుల మనోరథము లీడేర్ప వారి నందనుడనై శ్రీకృష్ణుం డనుపేర భూమియం దుదయించి మీకష్టముల బాపువాఁడను. మీ రేమియు నాలోచింప కుఁడు. కుమారా! నాయంశమున నీయాది శేషుఁడు బలభద్రుడై జనించువాఁడు. నీ వీ గీర్వాణ సముదయంబు నంతయు యాదవులుగ జనించునట్లు చేయుము. ప్రేయసీ! ఇందిరా! యే మిట్లూరకున్నదానవు? నీ సంకల్పమునగదా నామనోరథము లీడేరును? నీవు లేకున్న నా కవతారములే ఘటిల్లఁ జాలవు. కావున నాకెంతయు సైఁదోడుగనుండి యీ దేవతల పరితాపము మాన్పుము. నీవు నందగోకులమున నందుని భార్య యగు యశోదయందు జనింపుము. నీమాయచే నాకంసుని కన్నులఁ గప్పి నన్నెఱింగించి నాటనుండి భూలోకమున శక్తి స్వరూపిణివై నాభక్తుల పూజలఁ గైకొను చుండుము. మఱియు రుక్మిణివై జనించి నా వామభాగ మలంకరింపుము.

బ్రహ్మ—భాగ్యము. దేవతలారా! మనమీ దేవదేవునింక ప్రార్థింతము.

అనుబంధము 3

---

## ప్రథమాంకము—2 వ రంగము

### మధురా పట్టణము

### వివాహమండపము

[ఉగ్రసేనుడు, మంత్రులు, విప్రాదిసజ్జను లొకప్రక్కను, పౌరు లొకప్రక్కను కూర్చునియుందురు. దేవకీవసుదేవులు పీఠమున కూర్చునియుందురు. కంసుఁడు ప్రక్కన నిలిచియుండును. బ్రాహ్మణులు మంత్రాది నియమముల నాచరించుచుందురు]

కంసు—బ్రాహ్మణులారా! ఛాలింపుఁడు, మీయధిక ప్రసంగములు,

మంత్రులారా ! యీబ్రాహ్మణులకుఁ దగిన బహుమతులిచ్చి యనుపుఁడు.

గాల—కంసప్రభూ ! నేను చిరకాలమునుండి నీ పురోహితుఁడను. ఇట్టి లగ్న కాలమున నాకెక్కువ బహుమానము రావలయు.

కంస—అందుకే నీకేబహుమానము నీనాఁడు రాఁజాలదు. ఊరక మాటాడక పొమ్ము.

గాల—చిత్తము.

బ్రాహ్మ—దేవా ! నే సధ్యాపకుఁడను నాకు—

కంస—వెఱ్ఱిబాపఁడా ! నీ కేమిచెవుడా ! నీకెక్కువ బహుమానము వేరే కావలయునా ?

బ్రాహ్మ—మహాస్వామీ ! ఏమియు వలదు.

ఉగ్ర—(దేవకియొద్దకు వచ్చి) అమ్మాయీ ! నేఁడు నీవు నీవలచిన పతితోఁగూడి యీడులేని ముదమందుట మా కందరికిని సంతసమే యగు. తల్లీ ! నీపతియింట పరమసాధ్వీ గుణముల నెట్లు చాటించెదవో, నీ సౌశీల్యము నెట్లు ప్రకటించెదవో, కులసతీమహిమంబును వెలిపఱచి పుట్టినింటికిని మెట్టినింటికిని యెట్లైన లేనికీర్తి ఘటించెదవో ? తనయా ! పతినేదైవముగ భావించి పతిశుశ్రూషయే మోక్షమార్గముగ నెంచి పరమ పతివ్రతా శిరోమణివై వెలుగొందుము. అత్తమామలఁ మముఁ గాంచినట్లు కడుగారాబమున బరిచర్యం జేయుము. మఱిందులయెడ పుత్రవాత్సల్య ముంచి వారిఁ గరుణతో నరయుము. బంధువులయందు సంపద కలిగినప్పుడును, వారికి బీదరికము సంభవించినపుడును, సమభావముచే సహోదర ప్రేమంబున ఘటింపుము. దేవకీ ! భర్తనీయెడ నెంత కోప గించినను, నెంత దూషించినను, నెంత బాధించినను పతి భక్తిని మరువకుము. భామలకు లోకమున్న పతియే దైవము.

పతియే వ్రతము; పతియే తపము; పతియే సర్వధర్మము లని వేదములు బోధించుచున్నవి. కావున పతిభక్తిపరాయణవై యుండుము. పతి శయనించిన తరువాత శయనించి, పతి నిద్రలేవకమునుపు నిద్రలేచి, పతిభక్తిభావమున మెలంగు కులాంగనలకు జపతపాదులన్నియు నిరర్థకము లగుగదా? కుమారీ! రేపు తొలిజాముననే పయనము కావలయు. నిన్ని దినములు బోషించితిమి, పెంచి పెద్దజేసితిమి. ఇపుడు నీపతి వెంటఁ బంపుచున్నారము. ఇఁక మమ్ముల మఱచిపొమ్మా. పుత్రికావాత్సల్యమున నిన్నుపఁజాల కున్నను మన సనాతన ధర్మముచే పుట్టినింట నుంచికొనఁగూడమిచే నిన్ను బంపుట కెంతయో మనము రాయిజేసికొని పంపుచున్నారముఅమ్మా! నిన్ను మే మెంత కోపగించియుండినను మఱచిపొమ్ము: బుద్ధి గఱపుటకై యెంతశిక్షించియుండినను వానినెల్ల మనసున నుంచకుము నీజననీజనకుల నప్పుడప్పుడుస్మరింపుము. పోయి రమ్మ మఱల పుత్రవతివై మధురాపట్టణమునుఁ జేరుదువట లెమ్ము. మీయన్న కంసుడు నిన్ను బదిలముగా వీడ్కొని రాగలడు.

సీ. ఘనభక్తినిండార కని యుత్తమాముల
కెలమి శుశ్రూషల సలుపుమమ్మ
పతిని దైవముగాగ భావించి యెప్పుడు
పతియాజ్ఞ జవదాట వలవదమ్మ
తోడికోడండ్ర నీ తోబుట్టువులఁ బోలె
సుదతిరో! బలుప్రేమఁ జూడుమమ్మ
పరిచారికులఁగల్ల నిరుపేదలనుఁ గన్నఁ
గన్నపుత్రునిఁబోలెఁ గాంచవమ్మ

గీ. అతిథిపూజల మదినెందు నరయుమమ్మ
పరుషభాషల నెప్పుడు పలుకకమ్మ
దేవకీ ! మాకు సత్కీర్తి తేగదమ్మ
పోయిరావమ్మ శుభముల బొందుమమ్మ.

వసుదేవా ! ఈబిడ్డ యేమియు తెలియని ముగ్ధ, బాల, కావున దీని గుణముచే నరయుము.

వసు—అయ్యా ! తమయానతిమేరకు వర్తించెద. గృహస్థాశ్రమధర్మములఁ గొన్నిటి మిముఁ బోలు ధర్మజ్ఞులవలన వినియున్నాఁడను. మీయుపకారము నేనెన్నఁడును మఱువను.

చ. కరుణను బ్రోచితయ్య యుపకారము మీరెగదయ్య, నీవు నా
దరమున కన్యనిచ్చి గృహదానము చేసితివయ్య, నీకృపన్
మఱతునటయ్య ? నీతనయ మన్నన ప్రేమను బెంతునయ్య మ
మ్మిరువుర నాశిషంబులను నిచ్చి మహోన్నతి పంపుమయ్యరో !

దేవ—అయ్యా ! మీ యుపదేశము నన్నెంతయు కృతార్థనుఁ జేసెను. నేనెటు మిము బాసిపోగలను ? ఆత్మసుఖంబుల నించుకైన గణింపక. యామాసములలెక్కింపక, కడుప్రేమచే పోషించి, విద్యాబుద్ధులు నేర్పిన జనకుల బాసి యెట్లుపోవుదును ? తండ్రీ నేనెంతయు ముద్దుగా బెంచుచున్న నాముద్దుల జింక గర్భవతిగా నున్నదిగదా ? దాని నెట్లు డించిపోవుదును ? ఓ సఖులారా ! రాయంచలారా ! నాకిఁక సెలవిండు.

సీ. కడుప్రేమ నన్నింతకాలంబు పాలించి
దయను పెంచిన తల్లితండ్రులారా !
తోడునీడలఁబోలె తోఁబుట్టువులఁబోలె
నను బాయని సఖిజనంబులార !

నే భుజించినగాని నిర్మలదాడిమీ
ఫలములు గొనని యోచిలుకలార !
నడయాడు నేర్పుల నాకు బోధించి న
న్నలరించు నో రాజహంసలార !
గీ. నేడు మిముఁ బాసి పతియింటి కేగుదాన
మమత మఱవంగవలవ దోమాన్యులార !
హరిణశిశులార ! గురులార ! యమరులార !
పరగ నాకింక సెలవిచ్చి పనుపుఁ డయ్య.

ఉగ్ర—కుమారీ ! మఱల కొలది కాలములోనే నిన్నుఁ గాంచెదను కదా ? యోజింపకుము. నీ సెంపుడుజింక ప్రసవించిన వెంటనే నీకావృత్తాంతముఁ దెలియపరచెదను. లెమ్ము శుభముగ పోయి రమ్ము. మీగురువులకును, వందనీయులగు వారి కందరికిని నమస్కరింపుము. నీవునుఁ జక్కని కుమారునితోఁ గూడి నీజింక నాదరింతువట లెమ్ము.

దేవ—(అందఱికిని నమస్కరించును. ఆశీర్వదింతురు).

అనుబంధము 4

---

3 వ రంగము

అ ర ణ్య ము

[ప్రవేశము : కంసుఁడు సైన్యముతో, రథముపై దేవకీవసుదేవులు]

అనుబంధము 5

కంసు—సైనికులారా ! మీమీశిబిరముల నిచ్చటనే నిల్పుఁడు. ఇదే మధ్యాహ్నము కావచ్చెను. చండభానుఁడుచండతరకిరణుండై పాంథులను, వనతరుబృందములను నెంతయు బాధింప,

జొచ్చెను. ఆతపము కనులకు మిఱుమిట్లుగొలుపుచు తేరిచూడ రాకయున్నది. సమస్తదిశలు శూన్యములై కానవచ్చుచున్నవి. ఎండమావులు తమ నడబెడంగు పైపైఁ బారుచు బాటసారుల నెంతయు వంచించుచున్నవి. కానిండు. ఈ సూర్యుఁడు మిగుల పొగరెక్కి మింట విఱ్ఱవీఁగుచున్న వాఁడు. తొల్లి హిరణ్యకశిప రావణాదులు వాని కండకావరమణచి యున్నను మిడిదేరి మఱల నీఁటులఁ 'మత్సమో నాస్తి' యని నన్నింతయైన లెక్కగొనకున్నవాఁడు మీామీా రథతురగ పదాతుల నందలి విస్తారవృక్షచ్ఛాయలయందు విడియునట్లు చేయుఁడు. వెనక వచ్చుచున్న రథమున నున్న దేవకీవసు దేవుల నదె యక్కడ గాన్పించుచున్న లేమావికాంతా రమ్మున డించి వారికి ననువగు నుపచారములఁ జేయఁదగిన సేవకుల నియోగింపుఁడు. నాశిబిరముసైతము వారి విడిది దాపున నుండునట్లు చేయుఁడు. పొండు. నే నీవృక్షచ్ఛాయల గొంచెము విశ్రమించి వచ్చెదను.

సైనికులు—భాగ్యము. (నిష్క్రమణము)

కంస—ఆహా ! నాపేరు విన్నమాత్రమున సకలగీర్వాణబృంద మదే జగత్ప్రళయమని భావింతురు. ఇఁక భూలోకమన్ననో నాకరతలమునకుఁ జిక్కిన సముద్రమందలి తరంగములవలె తల్లడిల్లుచున్నది. ఆదేవేంద్రునిఁ గడతేర్పవలయునని యతిదృఢ ప్రయత్నముల నేఁ జేసియున్నను నావిష్ణువు వానికి సైదోడుగ నుండుటచేత నాయుద్యమ మంతటితో నెఱవేఱదయ్యె. ఇంక నచిరకాలములో మొదట నాహరి హరించుటకై దండు వెడలవలయు నని యున్నవాఁడ. అపు డింద్రుఁడు మృతప్రాయుఁడే కాఁగలఁడు. ఏ ప్రయత్నము చేతగాని కార్యము

నెఱవేర్చినగదా పురుషసింహుఁ డనఁబోలుదును? అయిన, నన్ను లోకు లందఱు దుష్టకర్ముఁడని పరిపరి నిందింతురు. నా చెయిదములకై నాయెదుట నాడకున్నను లోలోన నొచ్చి కొనుచు నన్నెంతయో నాడికొందురు. వదరికొననీ! శునకము కూతలు సింగంబును బ్రతారించునే? ఇక నాముదుసలి తండ్రియో; ఇది ధర్మము, ఇది యధర్మము, న్యాయము, అన్యాయ మని యెప్పుడు చూచినను మూలను గూర్చొని వదరుచుండును. ధర్మమనగనేమి? అధర్మమనగనేమి? మంచి మాటలకు మామిడికాయలురాలునే? మత్తేభేంద్రపరంపరలపై నురికిన హర్యక్షంబుపగిది లోకులపై నెత్తి కసిదీర చక్కాడి, బాధించి, వేధించి సంహరించి, తల్లడిల్లునట్లు చేసినగదా కంసుఁడన్న లోకంబు లన్నియు నిర్విణ్ణము లగును? "యేన కేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవ" యనిగదా నీతి శాస్త్రము ఘోషించు చున్నది.

(లోపలధ్వని)—6 అనుబంధములోని పల్లవి

ఆహా ఇదియేమి? నారదుడు వచ్చుచున్నట్లున్నది? రానీ చూచెదనుగాక.

[ప్రవేశము : నారదుడు హరిగానము జేయును]

అనుబంధము 7

నార—ఆహా! ఏమి యీ కంసుడు క్రోధానలమూర్తియై యున్న వాడు. వీనితో మాట్లాడ వలయునన్న భయముగనున్నది. అట్లయిన నాకార్యము సఫలమగు టెట్లు? కాని

అనుబంధము 8

కంస—నారదా! రమ్ము. కూర్చొనుము. (అనగా నారదుడు దూరముగా కూర్చొనును) నారదా! సమీపమునకు రమ్ము!

నార—కంసరాజేంద్రా! దూర మేమియు లేదు ఇక్కడనే యుంటి దను, నీకు సేమమా?

కంస—"సేమమా!" ఏమట్లడిగెదవు? క్షేమముగాక నాకక్షేమము గలిగించువాఁ డెవఁడు?

నార—భాగ్యము, ఇంకొకమారి యడుగను. ఏమి కడు సంతోష ముతో కూర్చొని యున్నావు?

కంస—నారదా! సంతోషము నాయదిగాక యింకొకరికిగలుగునా? నిజము. సంతోష మొక్కటియేగాదు ప్రపంచమే నాయది.

నార—కాని యెచ్చటికి నీప్రయాణము?

కంస—నాచెలియలగు దేవకిని నామె పతియగు వసుదేవుని పురము జేర్చి వచ్చెదను.

నార—(నవ్వును)

కంస—ఏమి నవ్వెదవు?

నార—నవ్వువచ్చిన నవ్వితిని.

కంస—అకారణ హాస్యమా?

నార—అకారణమేల? సకారణమే.

కంస—ఎవరు కారణము?

నార—నీవు.

కంస—నేను కారణమా? ఎట్లు?

నార—నీవు గాకపోయిన, నీబుద్ధి.

కంస—నాబుద్ధియా?

నార—అదియు గాకపోయిన నీయవివేకము.

కంస—నారదా! ఏమి నీమాటలు చిత్రముగా నున్నవి! నా యవి వేక మేమి?

నార—చంపు పగవానిం దానై వెదకికొనిపోవుట యవివేకముకదా?

కంస—నాకు పగవా డెవ్వడు ?

నార—ఇంకెవ్వరు ? నీ చెలియలగు దేవకీయే !

కంస—నా చెలియలు నాకు పగదా ? యెట్లు ?

నార—ఆమె కాకున్న నామె గర్భమున జనించు నష్టమపుత్రుడు నీకు పగవాడు కాగలడు.

కంస—నారదా ! మానవుం డనగ నేమి ? నాకు శత్రు వనగనేమి ? పురందరాదులు తమయూంద్రమంగళసూత్రమును చేతనుంచుకొని యనవతరము నన్ను స్మరించుచుందురు. నిర్భితిగ చెలరేగి భువనసముదయంబుల సదమద మొనర్చు నీమత్తగజేంద్రమునకొక పగవానిగల్పించితివా ? నీబుద్ధినీస్వాధీనమందున్నట్లు లేదు.

నార— నాకు బుద్ధిస్వాధీనమున లేదా ? నీయదృష్టము నీకు స్వాధీనమున లేదా ? నీకు శత్రువై జనించువాడు మానవుం డనుకొంటివా ? అతడు మానవుడు కాడు. రాక్షసుడుకాడు. వాచామగోచరుడు. దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు, వేదాంత వేద్యుడు, దేవుడు. నీకొరకయ్యే మీా దేవకి గర్భమున జనించువాడు.

కంస—వానిపే రెయ్యది ? వాడేల నాకొఱకై జనించును ? సవిస్తరముగా దెల్పుము.

నార—నాకు దీర్ఘసంవాదమున కవకాశము లేదు. నేను బ్రహ్మాలోకమునకు పితామహుజూచుట కేగవలయు. ఒక్కరహస్యముం దెల్పెద వినుము. ఏమన దేవత లందఱు నారాయణునితో మొఱపెట్టుకొనగా నాదేవ దేవుడు నిన్నును, నిన్ను బోలినవారిని సంహరించుటకై నీసహోదరీమణియగు దేవకి గర్భమున జనించువాడటు. నేను మొన్న నే వైకుంఠమున నీ యుదంతము వింటిని. విన్న సంగతి నీకు జెప్పితి.

కంస—నారదా! నన్ను బెదరించెదవా? నారాయణుఁడా నన్ను సంహరించువాఁడు? వాడు చెప్పినమాత్రముననే యీ కర్ణ కంటకములగు మాటలు నీవెట్లు వింటివి? నీవును నాప్రతిపక్షులతోఁ జేరితివా? నీకేల బుద్ధిచాలదయ్యె? అప్పుడే యీ జలమృగమగు కేశవునికి మదీయ ప్రతాపప్రభావంబు నేలయెఱిం గింపక పోయితివి? నిన్ను పేక్షించినందునకుఁగదా నీవింతనిర్లక్ష్యభావమున సంచరించెదవు? అనుబంధము 9

సీ. క్రతుసంతతుల నార్చి వ్రతసంతతుల నోర్చి
ఘనతమించుట యింత కననో లేదో
కలవాణు లనమించు లలనామణుల మించి
చెలనారులుగఁ జేత వినెనో లేదో ?
ఖలవాదముల మీరి యిల వేదములదారి
నడలింప బలవంత పడెనో లేదో ?
అలపొంద జనబృందముల నందరానట్టి
యిడుమల బడద్రోయు టెఱుఁగ లేదో ?

గీ. నన్నుఁ గన్నాఁడో యేమంచు నున్నవాఁడో ?
తెలియకన్నాఁడో తెలిసియే పలికినాఁడో ?
పుట్టనున్నాఁడో యాహరి పుట్టలేదో ?
బుద్ధిచెప్పుము నారదా! యుద్ధమేల ?

నార—(స్వగతము) అయ్యో! ఇదియేమి గ్రహచారము నాకు? చెప్పవచ్చిన పీడు నన్నే కోపగించుచున్నవాఁడు. (ప్రకాశముగా) ప్రతాపశిరోమణీ? నావలన తప్పేమియు లేదు. నేనా విష్ణువుతో నీవిషయమంతయు స్తోత్రముజేసి చెప్పియున్నాను. నీమహిమ యట్టివారికి దెలియునా?

చ. జలమట వానియిల్లు, జలజాతమటన్ మరి వానియాలు, నా
జలజభవుండటన్ సుతుఁడు, సార జలంబట వానియంగ; మా
జలజవినేత్రుఁ డాజలవిచారుఁడు నీ ఘనవిక్రమంబునన్
దెలియఁగ జాలునే మదిని దివ్యపరాక్రమ! కంసచంద్రమా!

కంస—భళిరే! నారదా! నీవుకదా నామెచ్చునకు వచ్చువాడవు.

నార— నేనిక వెడలివచ్చెదను. (నిష్క్రమించును)

అనుబంధము 10

కంస— (కొంచెమాలోచించి) ఆహా! నేడెట్టియుదంతయు వినగంటిని? ఇన్ని దినంబులు సముచిత విఖ్యాతిమై లోకశాసనమునుకొన వేలియం దిడుకొని సకల రాజరాజకిరీటమణివిద్యోతిత పాదారవిందుడనై యున్న నాకు కర్ణకంటకములగు 'శత్రు' వను రెండక్షరములు వినగలిగెగా? అందునునెందో యెచ్చటనో కాక నాప్రియసోదరియందు నా శాత్రవుడుదయించుచున్న నిదియేమివిపరీతమనవలయును? ఆ గీర్వాణులు తన సన్నిధానమున మొరయిడిన మాత్రముననే యానారాయణుడు నన్ను సంహరింప సమకట్టెగా? వానిని నామిత్రులిదివఱకే సమయించి యుండిన నాకింక భీతియుండదుగదా? లేక నారదు డేమైనా నాకెనలేని భయవిభ్రాంతి గలిగించుటకై యీ కల్పనాకథను పన్నియుండునా? ఇట్టియపోహావార్తకల్పించుట కతని కేమి యక్కఱ! ఇది యదార్థమనుటకుసందియము లేదు. ఆహా! ఈదురంత శాత్రవచింతారోగము కుదుర్చుకొన్నగదా నామదికించుక యూరటగలుగును? నేనిప్పుడే నా శత్రుసర్పమున కాధారమగు నా దేవకీవల్మీకము నష్టధ్వంసముజేసి నామనశ్చింత బాపికొందునా? అయ్యో! నా కెట్టి పాపబుద్ధి కలిగెను? నాకు దోబుట్టువై నేకడుగారాబమున బెంచిన చెలి

యలై నే నెంతయుఁగూర్చు సోదరియైన మాదేవకిని నేను కడ దేర్పవలయు ననెడిబుద్ధి కలిగెనా ? అకటా! యెంతపాపమున కొడిగట్టితిని ? ఔరా! ఈతుచ్ఛమగు పిచ్చిపామరత్వమను విష మును వెదజల్లి నాజీవితమును పాడుజేసికొనబోలునా ? చెల్లె లగుగాక! తల్లియగుగాక! తనయాపదలకు మూలమగు వస్తు వును పరిమార్పకుండుట ధీమంతుని లక్షణమగునా? కట్టా! నా యొక్కనిమనుగడకై యెవరోచెప్పిన యొక కల్లవృత్తాంతమును విని నాముద్దుసోదరిని ఖండింపఁబూనుట తగునా ? ఆ వెతకై తల్లిదండ్రు లోకక్షణమైన జీవింపగలుగుదురే! నారదుని వాక్కులు తథ్యములైనను నాశత్రువును తుదముట్టించుటకై వేఱొకయుపాయముగలుగదా ? (కొంచెమాలోచించి) ఆహా! వేఱేమియు నాలోచన పాల్పడదుగదా ? ఏమిసేయుదు ? ఔరా దాక్షిణ్యమును, గరుణను యోజించిన ప్రయోజన ముండునే ? మాయింట నుంచక పరుని యింటికిబంప యోగ్యమైన యొక యాడపడుచుకై తుదలేని దుఃఖసాగరమును నీదవలయునా ? ఇతరులయింటికి బంపుటకుమారుగా యముని యింటికే పంపె దనుగాక! నాకెంతయు బల్లెముఁబోలె బాధించు చెల్లెలున్న నేమి ? చన్న నేమి ? ఇదియే నిర్ధారణము. మున్ముందురానున్న నా ప్రాభవకీర్తి చంద్రిక కంతరాయకర ధ్వాంతసముదయ మేమి వచ్చినను, మేరుమందరము లడ్డపడినను మత్కార్య సాహసమును వదలను; మానను. హీనములై మానవుని యభ్యుదయలక్ష్మీలతాలవిత్రములై, ప్రసిద్ధ బాలికా విష ప్రాయములై యొప్పు కరుణా, దాక్షిణ్య, ప్రేమములను తుచ్ఛ భూతములను మదీయ ధైర్యవిజ్ఞానఖడ్గంబుచే నాశనమొనర్చె దను. కార్యసాఫల్యసంతోషరాజ్యమేలెదను. క్రౌర్యసాహస

పరాక్రమములను కరతలామలకముగాఁగొనెదను, దిజ్ఞభోంత రాళంబుల నెందును కంసుఁడను నామంత్రంబును జాటెదను. సకలగీర్వాణ స్తోమంబుల దురుద్యమంబుల నా పాదాహతి నలిపివైచెదను. మత్క్రోధప్రళయానలజ్వాలలకునీభువనంబుల నాహుతి జేసెదను. ఇదే వెళ్ళెదను.

అనుబంధము 11

(పాడుచు నిష్క్రమణము)

## 4 వ రంగము

## అ దే య ర ణ్య ము

[ఒక వృక్షచ్ఛాయయందు దేవకీవసుదేవులు కూర్చునియుందురు]

అనుబంధము 12

వసు—ప్రేయసీ! దేవకీ! చూచితివే యీకాంతారము? చూపరులకు నెంతయో వింతగొల్పుచున్నది. ఈ గిరికందరములనుండి ప్రవహించెడి సెలయేర్లు తమ జలబిందువులచే మార్గశ్రాంతులకు కడుంగడు శీతలసుఖ మొసంగుచున్నవిగదా? లోకమున బుద్ధి శక్తిలేని యీ నదీనదములే పరోపకార మొనర్చి తాము కటికటాల బడిమైనను ప్రజలకు సంతసము గలిగించుచుండ నీలోకు లొకింతయేని పరోపకారమునకుఁ బూనరుగదా?

దేవ—నాథా! నిజము లోకమున దైవమిచ్చిన బుద్ధిగలవారికంటె బుద్ధిలేని వస్తువులే మేలుగాదోఁచుచున్నవి. అంతయేల? మన మిప్పుడు గూర్చునియున్న మఱ్ఱివృక్షమునుజూడుడు. మనము మథురా పట్టణమునుండి యెంతద వ్వరుదెంచినను మనకు

మార్గాయాసము నింతేనిఁదోపనీయక యా సూర్యుని రాయి
డికి దన పర్ణములు సాచి మనలను గాపాడుచున్నది.

వసు—బాగుగా నుగ్గడించితివి రమణీ! ఏమి సూర్యుఁ డపరాంబుధి
గ్రుంకుచున్నవాఁడు. కంటివే?

సీ. అపరదిక్కామినీ విపులకేశభరంబు
పై నొప్పు నరుణంపుపద్మ మనఁగ
గగనరామామణి సొగసారు మొగముపైఁ
బొలుపారు కుంకుమ బొట్టనంగ
భూసతి కనకాద్రిపుత్త్రకు నాడింప
బ్రక్కఁ గట్టిన కెంపుపతక మనఁగ
దేవాంగనలు చూడ దివియందు గట్టిన
ముద్దారుమాణిక్యముకుర మనఁగ
గీ. సర్వకాలంబు తెలిపెడి చక్ర మనఁగ
మంత్రయోగులు పూజించు యంత్ర మనఁగ
పరగు బలుకెంపుదీప్తుల బరణియనఁగ
పశ్చిమాంబుధిఁ గ్రుంకెడుభానుఁ గంటె.

దేవ—ఔను అప్పుడే సాంధ్యరాగము కనుపించుచున్నది.

వసు—ఇక మనము పయనము సాగించుట మేలని తోఁచుచున్నది.
ఏల మీయన్న కంసుఁ డింకను రాలేదు?

దేవ—(అటునిటు చూచి) అదిగో! దూరమున వచ్చుచున్నట్లున్నది.

[ప్రవేశము: కంసుడు ఖడ్గమునెత్తి మహాక్రోపముతో పాడుచు]

అనుబంధము 13

కంస—(దేవకీదేవిని జడపట్టి యీడ్చి ఖడ్గము పైకెత్తి చంప ప్రయ
త్నించును, వసుదేవుడు భయభ్రాంతుడగును)

దేవ—(గడగడ వణకుచు) అన్నా! అయ్యో! అయ్యో! ఏమి
నన్నుఁ జంప సాహసించితివి?

కంస—నీవు చెల్లెలివైన నేమి? నీగర్భకుహరమునుండి నాకు శత్రుఁడగువాఁడొకఁడు జనింపగఁలడట. కావున నిన్ను సంహరించి శాత్రవబాధ లేకుండఁ జేసికొనియెద.

దేవ—అన్నా! ఎవరు చెప్పిరి? ఏ బాలిశుడు చెప్పెను? అట్టి వారి మాట విని నన్ను సంహరింపఁ జూచెదవా?

అనుబంధము 14

కంస—ఎవ్వరననేల? ఎవ్వరో యాకసమునుండి చెప్పియున్నారు. నే నేమిసేయుదు? నీప్రాప్తి యిట్లున్నది. నిన్ను విడువను.

(ఆఖడ్గము పై కెత్తును; దేవకి 'నాథా! నాథా!' యని మూర్ఛబోవును)

వసు—బావా! ఏమి యీ విపరీతము? నీముద్దుసోదరిని సంహరింపఁ జూచితివే? ఇప్పుడేగదా, అతి సంతోషమున మమ్మిరువురిని నూరు జేర్చుటకై నీతండ్రి నిన్నంపెను? ఇంతలో పిట్టదుగున నీకిట్టి దుర్బుద్ధిరాజెల్లునే? ఇదెక్కడిమాట? ఆబైలుమాటలనా, నీవునమ్మునది? అట్టిమాటలకై యెంతఘోరకృత్యముఁ జేయ బాల్పడితివి? అయ్యో! అన్నవైన నీవు చెల్లెలికి మాడ లిచ్చుటో వస్త్రముల నొసంగుటో, కనకభూషణంబు లర్పించుటో, యివన్నియు మాని వాటి కన్నిటికిని ప్రతిఫలముగా నీచేత నీ సుకుమారి కంఠంబుఁ ద్రెంపఁ జూచెదవా?

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు చీర లిచ్చుటో?
మన్ననసేయుటో, మధురమంజులభాషల నాదరించుటో
మిన్నులమ్రోత లే నిజము మేలని చంపకుమన్న మాని రా
వన్న, సహింపుమన్న, తగ దన్న, వధింపకుమన్న వేఁడెదన్.

కంస—ఛీ! వేమాట లేల? నన్ను బాధించు పగవాడు జనించుచుండ నేను దాని కియ్యకొని వానిం గడతేర్చు సాహసోద్యమముఁ జేయక యూరకుండు మంటివా? కావున నవశ్య మీామెను వధించెదను. నీవేమి చెపుఁనది?

వసు—(కంసునిచేతులం బట్టుకొని) కంసరాజేంద్రా! నా మాట లాలించి పిదప నీయిష్టమువచ్చినట్లుచేయుము. మేమిరువురము నీచేతిలోనివారముకదా? మృత్యువనునదివచ్చువేళ నెవ్వరడ్డ పడినను రాకమానదు. రానివేళ నెంద రెందఱు దానిని బ్రోత్సాహపరచినను రాజాలదు. ఇట్టిదానికై స్త్రీహత్యా పాతకమునకు నినుబోలు వివేకశిఖామణు లొడిగట్టుదురే? అందును నెందో యూరిపేరులేని సామాన్య కామినిని జంపు టయా? ఏకోదరమున రక్తము నర్థముగా బంచుకొని నీ మేనితో బుట్టిన సహోదరిని జంపుటయే? అయ్యో! యిట్టి వెడుగుమాటల విశ్వసించెదవే! యెవరో యొకరు ప్రమాణ పద్ధతి లేక, కారణము జెప్పక, వ్యర్థప్రలాపంబు లాడిన మాత్రముననే యామాటలు వేదవాక్యము లనుకొని "నా కొక శత్రువు జనించు" నని భవాదృశధీర శిఖామణి పరిత పింపబోలునే? అట్టి శత్రువు జనించుననియే నమ్మము అట్టివానితో సమసంగ్రామంబున హోరాహోరీ పోరాడి శాత్రవునిం దునుమాడి జగన్నుతమైన సత్కీర్తిని వడయుట గాదా ధీరశిఖామణుల కెనలేని భూషణము. ఆ చెప్పినవారి మాటలు తథ్యములని దేనినిబట్టి నమ్మవలయు? అట్టి సందే హాపు దుర్భాషలను జెవినిడి మనసార మన్నింపుమని వేడెడి నీచిన్న చెలియలిని కన్నాక వధింపనెంచుట నీకుంబిదప పశ్చా త్తాపము గలుగంజేయదా? కావున నీ కార్యము మానుము. వివేకము తెచ్చుకొనుము. కోపముచే జేసినకార్య మెట్టివాని నైనను వగనొందింపక మానదు.

మ. చెవియల్ కన్నియ, ముద్దరా, లబలనీసేమంబె చింతించు ని
ర్మల, దీనిన్ బయలాడు మాటలకునై మర్యాద పోగొట్టి, స
త్కులజాతుండవు, పుణ్యమూర్తి వకటా! క్రోధంబు పాపంబు న
చ్చెలి నోహో తెగవ్రేయపాడియగునే చింతించు భోజేశ్వరా.

కంస — వసుదేవా ! నాకా నీతి నేర్పెదవు ? నీయట్టివారికి పదివేవురకు నీతి నేర్పెదను బయలాడు వాక్యములని యెంచకుము. చెప్ప వలయునన్న జెప్పెదను. ఆనారదమహామునీంద్రుడే యీ యుదంతము నాకుదెలిపెను. ఇది విశ్వసనీయమోయవిశ్వసనీయమో నీవే తెలిసికొనుము. ఎక్కడిచెల్లెలు ! కార్యసాధకు లగువారికి బంధువాపి వరసలు, మానావమానములు నెంచదగునా ? ఇట్టి యొక యాడుదానికై చింతించిన నా ప్రాభవజీవిత ఫల వృక్ష మంతటితో నశింపదా ? పొమ్మూరక.

వసు — ఆహా ! నీయట్టినీతి నీయట్టివారికే తెలియును. తల్లి, దండ్రి, చెల్లెలు, అన్న, తమ్ములని భేదములేక చరించు మహానీయునకు నేనేమిచెప్పగలను? అప్పుడుశత్రుబాధకుతాళలేనివాడవు, రేపు దండధరుని బాధ కెట్లు తాళుదువు ? కటికి రాయియైన నీ ఘోరకృత్యమునుజూచి మార్దవము వహించునుగాని నీ మానసము మార్దవము వహింపదయ్యె. ఈధరణీరాజ్యము శాశ్వతమనినమ్మికొనిఘోరరౌరవనరకదాయక మనియెంచక పరమహేయ హింసాకార్యమనిగణింపక దీనిగాంచిన నీతలిదండ్రులు మనస్సంతాపదవానలంబు నించుకయైన శంకింపక, చెలువారు నింపుప్రేమంపు చుట్టములలో నెక్కుడగుగారాబుతోబుట్టువే యని యొక్కింత సంశయింపక, మహాపాతకావాచ్యనిందాకృత్యమని గణింపక, సకలజన భూషణాయమానంబగు కరుణారసంబును మది నింతయేనిం గొనక దురాశాపిశాచావేశితుడవై కన్ను మిన్నెఱుంగక, యస్మదీయనీతివాక్యంబులఁబాటింపక, కట్టా! యంతకంతకు దుర్మదక్రోధావిష్టుడవై, 'పాహి' యని పాదంబులపై బడిన పరమసాధ్వీమతల్లియగు చెల్లెలిని జంప నెంచితివే ? నీరాజ్యమును నీప్రభుత్వమును, నీసంపదయు నీదేహప్రాణంబులును స్థిరంబులని నమ్మితివా ? ఇది నీవెంటవచ్చునా ? మాంధాతృహరిశ్చం

ద్రాదు లెందరీభూమి నేలిరి ? వారొక్కరైన నీభూమిని వెంటఁ
గట్టుకొని పోవలేదు గాని నీవుమాత్ర మీసకలభూమండలము
నెచ్చటనుగదలాడకుండ నీవెంటబెట్టుకొని పోయెదవుగాబోలు

సీ. నిరతసత్యప్రౌఢి ధరణి నేలిన హరి
శ్చంద్రుఁ డీధరఁ బాసి చనగలేదె
ఎల్లలోకము లేలి యెసఁగు శ్రీనలరాజు
తనవెంట భూమిని, గొనుచు చనెనె
కృతయుగంబున కలంకృతిఁజేయు మాంధాత
సిరి మూటగట్టుక నరుగఁగనెనె
జలధి సేతువు గట్టి యలరారు శ్రీరాముఁ
డుర్విపై నిప్పుడు నున్నవాఁడె

గీ. ఎంద ఱెందఱో రాజులు నేగినారు
ఒక్కరును వెంటఁగొనిపోవ రుర్వితలము
నీవుమాత్రము రాజ్యంబు నీదు సిరియుఁ
దలను కట్టుక పోదువో ధర్మహృదయ!

వ. ఎవ్వారు లేరని నిర్జనారణ్యప్రదేశ మనియు నెంచినీవెంటనమ్మి
వచ్చిన చుట్టంబుల నట్టేట ద్రోసెదవే? నీవు బలిష్ఠుడవైనఁ
గానిమ్ము నీకు నే వెఱువను. ధర్మపద్ధతిని నీతిమార్గముచు చెప్పక
మానను. ఇంతకు మీతో వచ్చిన మాయిరువురి ప్రాణంబులఁ
గదా నీవు కొనెదవు? అవి తృణప్రాయములు. నేడుగాకున్న
మఱునాడైన జనగలవు. ఇంకేమి చేసెదవు? నామాట
లిప్పుడేల గ్రహించెదవు? పరలోకంబున యమయాతనలబడి
ప్రాణంబులుపోక పరితపించితనకులాడునప్పుడైన యెఱుగగలవు
ఈ పాపకార్యము నీవొక్కఁడ వాచరించినను, నెవ్వారెరుగ
కుందురని యోజింపకుము. సత్యమార్గ మవలంబించినసూర్య

డును, సకల దిక్కులును, ధర్మదేవతలైన నెఱుగరా !
కానిమ్ము. మమ్మీరుపురను వధింపుము.

సీ. నమ్మివచ్చినవారి నట్టడవినిఁ జంపఁ
దెలియ దెవ్వరి కంచుఁ దలపకయ్యొ
కలుషకార్యముకోడి, చలియించి తపియించి
దీపించుఖడ్గంబు తెలియలేదె
నీచేతఁగార్యముల్ నిత్యంబు చేయించు
తొలిజన్మకర్మంబు తెలియలేదె
జగముల రక్షించి సర్వంబు భరియింప
గల ధర్మదేవత తెలియలేవె

తే. గీ. పరగ నీయాత్మ, నాయాత్మ, పావనాత్మ
నిత్యజీవాత్మ, సగుణాత్మ, నిర్గుణాత్మ
అఖిలదేవాత్మ, సత్యాత్మ, అంతరాత్మ
నిరతకాలాత్మ, పరమాత్మ, యెఱుఁగలేదె.

కంస——ఈ గ్రుడ్డిబెదరింపులకు నేబెదరెదనని తలంచితివా ? చేటలుకొట్టి పిల్లుల బెదరించుట యెన్నడు నేర్చుకొంటివి ? యముడట ! నరకమట ! వాడెవడు ? క్రొత్తయముడా ? పాతయముడా ? మత్రోక్షధపీడనముల బరితపించుచు నే జెప్పినట్లు మదీయ శాసనమున వర్తించు యమునా నాముందరకొనియాడెదవు ! ఆయమునకు యముడను నేను కానా ? ఇక ప్రేలిన మీా ప్రాణములు దక్కవు. నాశత్రువును నేలబెట్టి కాల రాచుట నాకెంతయు గర్తవ్యము. దానికై యెట్టి సాహసమైన జేసెదను. ఊరక నిష్ప్రయోజనముగ స్త్రీని వధించెద నను కొంటివా ? యోజించి యోజించి యెందునం దారిగానక నాకొక దుర్నివారుడగు శాత్రువుఁ డుదయించుట కెంతయు

సహింపజాలక యిట్టి సహోదరీ మారణకృత్యమునకు సాహసించితివిగాక యిట్టి వివేకము తెలియక కాదు ఏమో బంధువని నీ నీచ సల్లాపములవినగల్గితిగాని నాయశ_క్తియని యెంచకుము.

వసు—(స్వ) ఏమో మార్గమునకు వచ్చుచున్నట్లున్నదిచూచెదగాక (ప్ర) కంసరాజేంద్రా! ఇదొక్కటియే నీకును నాకును ప్రథమ పరీక్ష నీకు శాత్రవబాధలేకుండునట్లును సహోదరీమారణ పాపము రాకుండునట్లును నేనొక్క చిన్న యుపాయము జెప్పెద. అపుడైనను నీవు చేయునది ధర్మమో యధర్మమో బయలుపడగలదు.

కంస—చెప్పుము. తొలుత జెప్పుము. మదీయఖడ్గధార దుర్వార ప్రతిపక్ష కంఠసీమయందునుపబడి విజయలక్ష్మిని చేకొనుటకై యెదురుచూచుచున్నది గాని చేతగాని యొక్క యబలను చక్కాడి లోకమున సాటిలేని యపకీ_ర్తి నొందుటకై వేచి యున్న దనుకొనకుము ఏది యా యుపాయము ? వచింపుము. నిర్భీతిగ వచింపుము.

వసు—ఇట్లడుగుము. యు_క్తి యున్నఁ గైకొనుము. మౌర్ఖ్యము మాత్రము వదలుము. నీచెలియలి యష్టమగర్భముగదా నిన్ను సంహరించునని నారదుడు చెప్పెనని చెప్పితివి.

కంస—అష్టమగర్భమనియే చెప్పినట్లున్నది (ఆలోచన నభినయించి) కాని యది దృఢమని నమ్మజాలను. కావున నే గర్భమైనను సరియే.

వసు—కానిమ్ము అయిన నీమెకు జనించు ప్రతిశిశువును జనించిన వెంటనే నీకప్పగించెదము. నీవేమైన జేసుకొనుము. ఇంతకై నీ చెలియలిని వధించునంత యావశ్యకత యేమి ?

కంస—సరియే ! (కొంచె మాలోచించి) నీ యుపాయము బాగుగనే యున్నది. అయిన మీరా శిశువుల దప్పక నిత్తురనుట కేమి ౘత్తరవాదము ? కావున నిది యెన్నటికిని సరిపడదు.

వసు—అంతయేల ? అంతవఱకు మే మిరువురము నీ భవనముననే యుండెదము.

కంస—కల్ల, గ్రహచార సమయమున నెవ్వరికెట్టి బుద్ధి గలుగునో యెవ్వ రెఱుగుదురు ?

చ. తనయుఁడు కీడునెంచు, తనధర్మసతీమణి యేవగించు, తా
జనకుఁడె మోసగించు, సహజాతుఁడు దుండగ మెంచు తన్నుగాం
చిన జనయిత్రి శత్రువయి చిక్కులఁ బెంచు, విరోధ కాలమునన్
తనరిన వేళ బంధువుల తాల్మిని నమ్మగ రాదుధారుణిన్.

కార్యముపట్ల నేనెడమచేతిని కుడిచేతిని నమ్మువాడను గాను. అందును మీరా ముదుసలియగు నుగ్రసేనునితో మొఱబెట్టుకొంటిరా నా కార్యమంతయు విఫలమగును. కావున నెనమండ్రు పుత్రులను ప్రసవించువఱకు మాత్రము మిమ్ము కారాగృహమున నుంచెద. పిదప విడిచెద.

వసు—కంసరాజేంద్రా ! ఇది న్యాయమా !

కంస—ప్రేలకుము౦క, వచించినది వచించియేయున్నాడను. మిన్ను విఱిగి పైబడినను వెనుదీయను సేవకులారా !

[ప్రవేశము : సేవకులు]

వీరిద్దరిని మధురాపట్టణమునకు గొనిపోయి కారాగృహము నందు నుంపుడు. వీరి రక్షణమున మిక్కిలి జాగరూకులై యుండుడు. తప్పితిరా మీయొడళ్ళు మీవికావు కొనిపొండు వీరిని.

(నిష్క్రమింతురు)

శ్రీ

# కృష్ణలీల నాటకము

## ద్వితీయాంకము

### 1 వ రంగము—కారాగృహము

(శృంఖలాబద్ధులై దేవకీవసుదేవు లుందురు)

అనుబంధము 15

దేవ—దైవమా! నాయట్టి నిర్భాగ్యురా లెవరైన జగతినుందురే? ఎవరైనకష్టముల ననుభవింపవలసివచ్చినఁ దమపగవారినుండి గదాయనుభవింతురు? నాకటుగాక నాకూర్మియగ్రజునుండియే వినరాని కనరాని కష్టములు గల్గెనా? పురాకృత పాప ఫల మెంతగలదో కన్న కసిగందువుల గనులార జూచుటకైనం బ్రాప్తిలేదయ్యెగా? అకటా! కంసుని బోలిన కఠినాత్ము డెవడైన నుండునే? ఏమియు నపరాధ మెఱుగని నెత్తురు గందుల గన్నుల తెరచి తెరవని చిన్నపాపల నించుకైన గని కరంబులేక వధించి యేమిఫలము ననుభవించెను? నాథా! నాడేల నీ వా కంసుని వేడికొంటివి? ఆనాడే వాని నిశితఖడ్గ ధారచే నే వధింపబడి యుండిన నిట్టి పుత్రశోకము గన్నులార దిలకించుకష్టము నాకు లేకుండుగదా? ఒక్కరుకాదు. ఆరు గురుని. చిలుకపిల్లల బావురుగాని కప్పగించి నట్లయ్యెనే! ఈ

పాపాత్మురాలికిన్ని కష్టములు చాలవని, మొన్న యేడవగర్భము సైతము గర్భస్రావరూపమునబోయెనుగదా! ఇప్పుడుమాత్రము సంపూర్ణ గర్భవతినై యుండి యేసుఖము లనుభవింప నున్నదానను? కన్నసుతుల ముద్దాడి వారి ముచ్చట లాలించి. మనసార ముద్దిడుభాగ్యము లేదయ్యెగా? ఇక నే మనజాల! గర్భవతినై యీ ఘోరకష్టము చూడజాల. ఈ జనించు శిశువును కంసుని కరవాలధార కప్పగింపజాల.

వసు—ప్రేయసీ! ఏమి చింతిల్లి యేమి ప్రయోజనము. తొలిజన్మంబుల నెన్ని శిశుహత్యలఁ జేసియుంటిమో యా పాపఫలము నిప్పు డనుభవించుచున్నారము. అయినను నా దేవదేవుడా శ్రీహరి మన మొఱాలించి మనకష్టముల కంతము చేయగలడు. ఊఱడిల్లుము.

[ప్రవేశము-నలుదిక్కులనుండి యీశ్వరుఁడు, బ్రహ్మ, ఇంద్రుడు నారదుడు మొదలగువారు]

ఈశ్వ—దేవా! శ్రీరమణా! దేవకీదేవి గర్భమునుండి వెలువడుము. నీకై, నీరాకకై యెదురుజూచుచున్న మమ్ముగాపాడుము. జనార్దనా! బ్రహ్మచే లోకములసృజింపజేసి యే కంటకంబులు రాకుండ నన్నిజగములఁ రక్షించుదయామయుడవుగదా నీవు? నిర్గుణుడవై, నిరంజనుడవై నిస్సమానుడవై యెల్లవేళల నెల్లదిశల నెల్లలోకముల గుక్షియం దిడుకొని మత్స్యకూర్మాది యవతారము లొంది పరిపాలించువాడవుగదా నీవు?

మ. గురుపాఠీనమవై, జలగ్రహమువై, క్రోడంబవై, శ్రీనృకే
సరివై, భిక్షుకుడై, హయాననుడవై, బ్రహ్మదేవతాభర్తవై
ధరణిన్ రాముడవై దయాగణగుణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే.

బ్రహ్మ—కమలనాభా! నిన్ను గొల్చినవారికి జననమరణాదులు లేకుండ జేయు నీకు బుట్టుకయొకటిగలదా? లోకవిడంబనార్థమై జనన క్రీడావిలాసంబుల నటించెదవుగాక! దుష్టజన దవానలంబున దహింపబడుచున్న లోకముల భవత్కారుణాపాంగ వీక్షణ సుధారసమునఁ జల్లజేయుము.

క. వృచ్ఛిలియున్నదిలోకము
నిచ్చలు కంసాదిఖలులు నిర్దయులైనన్
మచ్చికఁ గావఁగ వలయును
విచ్చేయుము, తల్లి కడుపు వెడలి ముకుందా!

ఇంద్రు—దేవా ఇన్నిదినములు హిరణ్యకశిపుని బారినుండి మమ్ము రక్షించితివి. బలిచక్రవర్తి విక్రమమణచి నాకు స్వర్గరాజ్యమిచ్చికాపాడితివి. రావణ కుంభకర్ణాదులచే వచింపరాని యవస్థకులోనై యున్న సర్వలోకముల దయామతివై పాలించితివి. ఇపుడు కంసాది దానవులిడు నిడుమల పాలైయున్న మమ్ము నీవు బ్రోవకున్న మరియెవరు బ్రోచువారు? పరమపురుషా! ముకుందా! దేవకీ గర్భమునుండి దయచేయుము.

సీ. రాఁగదే యోదేవ! రాజీవదళనేత్ర!
రాఁగదే విమలేన్దిరావిహార!
దయచేయవే దైత్యచయనాశ! జగదీశ!
వైకుంఠపురవాస! మందహాస
అవతరించవె దివ్యనవనీరదశ్యామ!
కౌస్తుభమణిదామ! కాంతనామ!
విచ్చేయు గోవింద! వినుతతాపసబృంద?
భక్తాభయానంద! వరముకుంద!

గీ. మాధవా ! లోకమంతయు బాధ జెందె
కరుణ గావవె బ్రోవవే కనులఁ గనవె
ఎంచి యామష్టకంసు వధించి మించి
సంచరింపగ రాగదే సదయహృదయ.

నార—గోవిందా ! సమస్త సురలు యాదవులై జనించియున్నవారు. భూభారము దినదినమున గడుహెచ్చుచున్నది. నీరాకకై యెదురుజూచు భూసతీ రత్నమును మక్కువచే నారయుట కిదియే తఱి విచ్చేయుము. తల్లీ ! దేవకీదేవీ నీభాగ్య విశేష మెంత శ్లాఘనీయము. పరమయోగులకైనను, జపతపాదులఁ జేయు కర్మయోగులకైనను, బొందరాని శ్రీహరిసాక్షాత్కార పుణ్యము గంటివి. అమ్మరో! ఆ శ్రీధరుడు నీ గర్భవాసమున నున్నవాడు. ఉదయించి నీ యిడుమల బాపువాడు. చింతిల్లకుము ఊరడిల్లుము.

మ. తల్లి ! నీ యుదరంబులోన బ్రధానపూరుషుఁడున్న వాఁ
డెల్లిపుట్టెడు కంసుచే భయమింత లేదు నిజంబు మా
కెల్లవారికి భద్రమయ్యెడు నింక నీకడు పెన్పుడున్
చల్లగావలె యానవాళి సంతసంబును బొందగన్

(అందరు నిష్క్రమింతురు)

(ఒక శబ్దము పుట్టును, అనేక విద్యుత్ప్రకాశములతో గొప్ప వెలుతురు గలుగును. దానియం దొక వ్యక్తి శ్రీవిష్ణుమూర్తిగా నుద్భవించును. దేవకీవసుదేవులు దిగ్భ్రమ నొంది చూచి; సంతసించి, సాష్టాంగ దండప్రణామంబులఁ జేయుదురు)

వసు—దేవాదిదేవా! సుప్రభావా! గోవిందా! ముకుందా! నీలమేఘశ్యామా ! నీదయాలోకమున మా తాపత్రయముల బాపుము. నేనుసంసార సుఖముల నపేక్షింపను. ఐశ్వర్యములఁగాంక్షిం

పను, రాజ్యము నాశింపను. నిత్యమై, నిరుపమానమై, నిర్దుఃఖమైయలరారు మోక్షసుఖ మొసగి కాపాడుము, కాపాడుము.

దేవ—లక్ష్మీవల్లభా! లోకవల్లభా! దీనశరణ్యా! కంసునిచే బాధితులమై గత్యంతరముగానక యజస్రము నిన్నే ధ్యానించుచున్న మాపై దయరావించి, చల్లగపాలించి. కృపాకటాక్షముంచి గద మాకు సాక్షాత్కరించితివి! పుండరీకాక్షా! భవదీయసచ్చిదానందస్వరూపమును గన్నులారఁదిలకించెదమన్న మాయిరువురి నేత్రములకు సాధ్యముకాకయున్నది. శ్రీవరదా! జ్ఞాననేత్రముల నొసగి తనివిదీర నీమూర్తినిగాంచుపరమభాగ్యము దయచేయుము. దేవా! స్త్రీ చాపల్యమున కోరిక గోరరానిదియైనను నీకోర్కె ఫలింపజేయుము. వాచామగోచర మగు కౌస్తుభభూషితమగు లక్ష్మీ సన్నిధానమగు, నీ దివ్య ప్రభావ దేహము నొక్కపరిగాంచి మాజన్మ సాఫల్య మొందెదము. నారాయణా! భవద్దర్శనభాగ్య మబ్బుటచే నీ చెరసాలయే వైకుంఠధామ మగును. ఈ ధూళిధూసర కఠిన ప్రదేశమే మణిమయసౌధ మగును. త్రివిక్రమా! పురుషోత్తమా! అనాథులమై యున్నవారము. నీవుతప్ప శరణాంతరము గాంచనివారము. ప్రోవుమా కరుణింపుమా.

విష్ణు—దేవకీవసుదేవులారా! ఇదె మీకు జ్ఞాననేత్రముల నొసంగితి. ఒక్కపరి దిలకింపుడు.

వసు—పరమాత్మా! నీ కరుణారస మేమని కొనియాడుదుము? నీ దివ్యతేజోమయాంగమును గాంచితిమి. ధన్యత మించితిమి. సారసలోచనా! భవదీయమూర్తిని గాంచిన యీ నేత్రములు మఱల బ్రపంచమును జూడకుండ జేయుమా.

విష్ణు—పావనులారా! మీరుతొలిజన్మమున నన్నెంతయో యారాధించితిరి. మీరు యిరువురిలో నీవు, పృశ్నియగు నొకకామిని,

నీవుసుతపుండను మహానీయుడవు. మీరుఘోరకాంతారమున నన్ను గూర్చి యద్భుతరీతి దప మొనర్చితిరి. మీ భక్తికి మెచ్చి నేను మీకు సాక్షాత్కరించితిని. అపుడు మీరు దివ్య మోక్షపదవిని గోరక నాయట్టి కుమారుడు కావలయునని వేడితిరి. మూడుజన్మముల యందు మీకు కుమారుడనై నేనే జనించునటుల మీకు వరంబొసంగితి. మొదటిజన్మమున పృశ్ని గర్భుడను పుత్రుడనై మీకు జనించితి. రెండవ జన్మాంతర మున అదితికశ్యపులుగా జనించిన మీకునేను వామనావతార మొంది పుత్రసుఖ మొసంగితిని. ఇపుడు మూడవ జన్మమున దేవకీవసుదేవులుగా నుద్భవించిన మీకు నేను శ్రీకృష్ణుడను కుమారుడనై జనించితి, మీ రేమియు నాలోచింపకుడు.

చ. పొగలకుమమ్మ నీకు వరపుత్రుడనై జనియింతునమ్మ నీ
పగతునిఁ గంసుఁ ద్రుంచి మిము బంధవిముక్తుల జేతునమ్మ మీ
కగణితసంపదల్ గలుగునమ్మ మహోన్నతమోక్షసౌఖ్య మొం
దఁగ నగునమ్మ నిత్యప్రమదంబున వెల్గుదువమ్మ దేవకీ!

వసు—దేవా! కంసుడు మాకు జనించుకుమారులనందఱిని గ్రమముగా వధించెను. నిన్ను గాపాడు విధాన మెట్లో తెలియకున్నది.

విష్ణు—మీ రేమియుఁజింతింపకుడు. ఇదివఱకే యీమె గర్భమున వృద్ధిగాంచుచున్న నా యంశమగు నాదిశేషుని తేజమును రేపల్లెయందు రోహిణియనెడు యాదవాంగన గర్భముననుంచి జనింపజేసి యున్నవాడ. ఆ యేడవగర్భమే యీమెకు గర్భ స్రావమైనదని మీరనుకొనుచున్నది. నాయోగమాయ యా రేపల్లెయందు యశోదాదేవి గర్భమున జనించియున్నది. (వసుదేవునితో) నీవు నన్నిపుడే రేపల్లెకు గొనిపోయి యా యశోద ప్రక్కనఁబరుండబెట్టి యామె స్త్రీ శిశువు నిచ్చటికిఁ గొని తెమ్ము. దానిని గంసుఁడేమియుఁ జేయజాలడు.

వసు—దేవా! ఇదియెటు సాధ్య మగును? కదలనేరకుండ సంకెలలు వేయబడియున్నవి. ఈయర్ధరాత్రమున నేఁబోవునపుడుకంసుని భటు లెవరైన నన్నుఁ గాంచినఁ దప్పక మోసము వాటిల్లును. ఇదియుఁగాక యపారమగు యమునానది నెట్లు దాటుదును? ఎఱుక లేనితనమున నేనింత ప్రశ్నించినందుకై నన్ను క్షమింపుము.

విష్ణు—నీ వేమియు భయపడవలదు. నీ కీ సంకెల లుండనేరవు. ఎవ్వరు నిన్ను దిలకించినను నీకే యపాయమురాకుండ నేగాపాడెదను. యమునానది నీకు దారి యివ్వగలదు. వేయేల? నీకే యంత రాయమును గలుగదు. ఇదే నే నిప్పుడే లోకసామాన్యమగు బాలుని రూపమును గైకొనియెద.

(వసుదేవుని సంకెల లూడిపోవును. సేవకులు మూర్ఛ నొందెదరు. విష్ణురూప మదృశ్యమైపోవును. ఒక చిన్న బాలుఁడుదయించగా దేవకి వాని నెత్తుకొని ముద్దాడును)

వసు—(కడు సంతోషముతో) సతీరత్నమా! తెమ్ము, మన భాగ్య ఫలమును తెమ్ము. మన మోక్షఫలమును తెమ్ము. మన దేవ దేవుని తెమ్ము. ఒకతూరి గన్నులార దిలకించి నా కిమ్ము.

దేవ—(బాలకుని నెత్తుకొని) ఆహా! ఈ బాలుడు సచ్చిదానంద శీలుడు. భాసురకపోలుడు. నాచెంత ముచ్చటలాడుభాగ్యము నోచనైతిగా? కటికపగదాయియైె కంసుడు కులపాంసనుడు నా కన్నబిడ్డల నన్యాయముగ నాకు లేకుండజేసెనే? రమా రమణా! నాకేల సంతానఫలమిచ్చితివి? అట్లైగొడ్రాలై పడి యున్న నాకీదుఃఖ ముండియుండదుగదా? ఆ చింత నంతయు మఱచి యీకుమారరత్నమును దిలకించి ధన్యతగాంచ నెంచి తినిగా? అట్టిభాగ్యము నాకు గనిపించి గనిపింపకపోయెగా? ఓకుమారా! రూపజితమారా! నీవు వటపత్రమున శయనించి

సమస్తలోకముల నీ నేత్ర విలోకనమునఁ గలిగింప జేయలేదా? అదితిదేవి యంకపాలిపై శయనించి, కరంబు నలంకరించి, ముద్దులనించి, మురిపెము వహించి, వామనుఁడను పేరుచే నామె కెంతయు నందరాని మోక్షపదవి నొసంగలేదా? గౌసల్యా ముద్దులబాలుడవై, జానకీమనః కాముడవై తల్లి దండ్రుల గృతార్థుల జేయలేదా? ఇపుడు నేనొనర్చిన యపరాధ మేమి? ఇంతలో ననుఁ బాసెదవే? నిన్ను గన్నులార నింకను చూడనైనను లేదుగదా? నీముద్దుమాటల నాకెపుడు వినిపించెదవు? నీయాటపాటల నెప్పు డాలింపఁజేసెదవు? నా యంక పాళిపై శయనించి "అమ్మా" యని యెప్పుడు ముద్దులొలుకఁ బిలిచెదవు? అన్నా! పోయి వచ్చెదవా? మఱల నీజననిని గాంచెదవా? లేక యీ జన్మమున నింతియే ప్రాప్తియా?

సీ. వటపత్రశాయివై బహులోకముల నెల్ల
కనులు విప్పినయంత కనగలేదె?
అదితియంకముఁ జేరి యల వామనుండవై
చెలువార ముద్దులఁ జిలుకలేదె?
ముదమార కౌసల్యముద్దులరాముఁడై
యసమభాగ్యము నామె కొసఁగలేదె?
చూచిచూడకమున్నె నాచిరుపాప నన్
బాయుట నాపాపఫలము గాదె?

గీ. రాజసమపాల! భక్తసంత్రాణశీల!
జగదవనలోల! సత్కృపాసారజాల!
అభ్రసమనీల! సుకుమారతాలవాల!
బాలగోపాల! సుకపోల! భాగ్యశాల!

వసు — దేవీ! శోకించిన నేమి ప్రయోజనము? ఎంత శోకించినను మనప్రాప్తి యింతయే. ఏ యపాయమురాకుండ నీకుమారుడు రేపల్లెయందు రక్షింపబడుచుండ నా క్షేమవార్త విని యైనను సంతసింపవచ్చునుగదా? ఇందీ కంసునిబారి కప్పగించి మనకన్నులెదుట - అకటా! తలముకొన్న వట్టిరాగుండియ యైన నీరగుగదా - అట్టితలపరాని శత్రువునకైనఁగోరరాని ఘోరకార్యముజూచుటకన్న మేలుగదా? తరుణీ! మనకీయెన లేని, యెవ్వరికిలేని, సుకుమారుడు మారుడు, మారజనకుడు కుమారుడుగా నున్నను సమీపించివచ్చు భాగ్యము సయితమనుభవించు నదృష్టము కలుగదయ్యెకట్టా! మనలఁ బోలిన హతభాగ్యులుందురే! తొలిజన్మమునందలి ఫలమునకు చింతించిన నేమిప్రయోజనము? లెమ్ము, ధైర్యముపూనుము. బాలకునిమ్ము. అదే యర్ధరాత్రము మీఱుచువచ్చె.

అనుబంధము 17

దేవ — అయ్యో! చేతికివచ్చిన ఫలము ననుభవింప నేరకున్న దాననే! ఆజన్మము దుఃఖములకు నిలయమగు నాయట్టి నిర్భాగ్యురాలి కట్టిభాగ్యమేల లభించును? పాపడా! నాచిన్నితేడా! నా యట్టి పాపాత్మురాలి గర్భమున నేల జనించితివి? అకటా! గర్భమున కలిగిన కన్నకుమారు నొకక్షణముమాత్రము రక్షింప జాలని తల్లి నెందైన వింటిమే? ఎంతదరిద్రులైనను తమపుత్రుల నెందైనఁ బారవేయజూతురా? బాలకా! పోయిరమ్ము. మఱల నినుఁజూచుట సంభవించునో సంభవింపదో కాని యిదే యొక్కమాట వచించెదను. ఎప్పుడైనను నీ తల్లిని స్మరింపుము. నాముద్దులయ్యా! నీకుమార్గమున శుభమయ్యెడు. అలనాఁ డయోధ్యపురిలో పితృవాక్యపరిపాలన

మొనర్చుటకై యడవికేగు శ్రీరామచంద్రున కేయాశిష ములు నా కౌసల్యా మహాదేవి యొసగెనో యాం యాశిష ములు నీకు గలుగుగాక, ఆ మృకండుమహాముని తన నంద నుడగు మార్కండేయుని చిరంజీవిత్వము గోరి తప మొన రింప బంపునపు డేవరములనిచ్చి పంపియుండెనో యాశుభ ములు నీకు గలుగుగాక (ముద్దిడుకొని యిచ్చును)

వసు—(శిశువును దీసికొని) అన్నా! రమ్ము. నీకు జాతకర్మ నామ కరణాదులనైతముచేయుదుమన్న శక్తిలేనియీతండ్రినేమియు గనలకుము. కనులు తెరవని చిన్నపాప నెందో పారవైచెడు నిష్కర్ముడని దూరకుము. విధిలేక కంసునికి వెఱచి నిన్ను దూరమున విడిచివచ్చెదగాని వేరని తలపకుము. పెఱిగి పెద్ద వాడవై, కడిదిజేడవై పుణల నాయొద్ద జేరుము.

సీ. పుత్రరత్నమ! నిన్నుఁ బుట్టినంతనె యెందొ
పారవైచితి నందు దూరకన్న
కన్నబిడ్డల నింట కాపాడి బ్రోవలే
నట్టి తండ్రికి నేల పుట్టితన్న?
సొంపార నీముద్దుసుద్దుల నాలించు
నట్టిభాగ్యము నోచనైతి నన్న!
అన్నరో! మరల ని న్నెన్నఁడు జూతుమో
కనులార నిప్పుడే కాంతుమన్న!

గీ. యిపుడు నొకసారి నీముద్దు నీయ వన్న!
తల్లిదండ్రుల నెపుడైనఁ దలపు మన్న!
ఎందు శ్రీహరి నిన్ను రక్షించువన్న
పోయిరావన్న! శుభములఁ బొందుమన్న!

(ముద్దిడుకొని) దేవతా సార్వభౌములార! వనదేవతలారా! పురకాంతారములారా! రేపల్లెయందలి ధేనువులారా! యీ పసి బాలుని బాలింపుడు.

సీ. కలువల చెలికాని గనువాని నీ బాలు
నేలరే ఘనలోకపాలులార!
కలుముల దేవిసంగడికాని సుకుమారు
నరయరే సారదయాళులార!
తొలిపల్కులను మించు తొలిపాప గల పాప
బ్రోవరే పరిణతభావులార!
వెలలేనివలపుల వలతేని గన్న యీ
చిఱుతను గావరే సిద్ధులార!
గీ. సరసనదులార! గిరులార! తరువులార!
మౌనివరులార! హరులార! మాన్యులార!
సతతగతులార! శ్రుతులార! వ్రతతులార!
మాదుగోపాలు ఘనలీలు మనుపుఁడయ్య!

(నిష్క్రమణము)

2 వ రంగము : మధురాపట్టణము, రాజాస్థానము

[కంసుడు, వక్రనాసుడు, అఘాసురుడు, ధేనుకాదుడను మంత్రులు మొదలగువారు నుందురు]

కంస—మంత్రులారా! సచివచంద్రులారా! భూమండలం బంతయు మదీయ శాసనమునకు లోనయ్యె. ఇక మనము దేవలోకము నిర్జించుటకై తగుసన్నాహంబుల సలుపవలయు, నామిత్రులగు జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదులకు నుదంత మిప్పుడే చెప్పి

పంపవలయును. వారందఱు నెప్పు డీభూలోకము నుర్వోత్తుగ ద్రమింగెదమని యోహటించుచుచుందురు. అస్మదీయాంగీకార మున కయ్యే యింతకాల మూరకున్నవారు. కావున మనమం దఱము జక్కగ పర్యాలోచించి దండయాత్రకు సేనలసిద్ధపఱుప వలయు. మీరిపుడే జరాసంధాదులకు నొక పత్రికవ్రాయుడు. ఇదియుగాక మొన్న కళింగదేశమునకు బంపబడిన సేనానులు నాదేశమును జయించినవార్త బంపియున్నారా?

వక్ర — దేవా! ఆసేనాపతు లింకను రారైరి. వారు జయము పొంది రనుట కొక సందియముకలదే! ఏలినవారి సేనాపతుల కప జయము గలుగుట జగము తల్లక్రిందగుటయే గదా?

అఘా — ప్రభువతంసమా! ఒక్కవృత్తాంతమును బకాసురుడు దేవర వారి కెఱింగించునటుల చెప్పి పంపియున్నవాడు. వాడుండెడి గంధమాదన పర్వతప్రాంతమున బ్రాహ్మణులు మిక్కిలి జన్నములు చేయుచున్నారనియు, నాయజ్ఞములయందు హవి ర్భాగము గొనుటకై దేవతలు వచ్చి విఱ్ఱవీగుచున్నారనియు జెప్పి పంపియున్నాడు.

కంస — ఏమి యేమి? ఆబాపలు దుర్మదాంధులై నన్నుగాదని దేవ తలకునై జన్నములుచేసిరా? మంచిది. వారికి దిటిపెంపుతిండి వలన గర్వము తలకెక్కెఁగాబోలు. మీ రిప్పుడే యా బకా సురునకు వారి నందఱిని నలచి, కలచి, త్రొక్కించి, ద్రమందించి, సంహరించునటుల నాకట్టడి బంపు.

ధేను — దేవా! ఈ జన్నికట్టులగు బాపలెంత వెఱ్ఱివారలు? దేవుఁ డనగ నీకంటె నెవడు? విష్ణు వనగ నీకంటె నెవడు? శంఖ చక్రములు లేవుగాని యాచక్రివే నీవుగావా?

కంస—ఛీ! ఆమాటనకుము. వాని కొక్కచక్రమే యుండునది. నే నన్ననో వేనవేలు చేయించియున్నాను.

ధేను—అయినను మీరేవిష్ణువు.

కంస—సందేహమేమి? విష్ణువు! విష్ణువు పితామహుడను. మఱియు పలికిన విష్ణువు ప్రపితామహుడను. నేను వానివలె దొంగపని జేయుదునా?

అఘా—రాజేంద్రా! మన ప్రజలనందఱిని దేవాలయములయందు మీప్రతిమల పూజించునటుల నేర్పరచియున్నాను.

కంస—భళీరే! భళిరే! నీవుగదా నామది కెక్కువాడవు!

[ప్రవేశము : సేవకుడు]

సేవ—దేవా! పరాకు. కారాగృహమున మన దేవకమ్మ చిన్న బిడ్డను కనినది.

కంస—మీరు శీఘ్రమునఁ బోయి యా శిశువుతోడ వారిని దోడు కొనిరండు. పొండు.

సేవ—భాగ్యము. (నిష్క్రమణము)

కంస—ఇదియేగదా! యెనిమిదవగర్భము. దీని నుపేక్షింపరాదు. దీని నిప్పుడు చక్కాడిన నాకెదు రెవ్వరు గలరు? ఆహా! పురుష ప్రయత్నమునకు నసాధ్యము గలదే? ఎట్టియసాధ్య కార్యములైనను ప్రేల్మిడి సాధింపనగునుగదా?

[ప్రవేశము : దేవకీ వసుదేవులతో సేవకుడు]

సేవ—దేవా! మీయానతిమేరకు వీరిని గొనితెచ్చియున్నాను.

కంస—(దేవకిని సమీపించును)

దేవ—అన్నా! శమింపుము. నాపైదయరానిమ్ము. ఇది నీకోడలగుఁ గాని యల్లుడు కాడు. నా యష్టమగర్భమున జనించిన పుత్రుడుగదా నీకు బగవాడని వింటివి. ఇది నా పుత్రుడు కాదు. పుత్రిక యగుగదా? దీనిని వధింపవలయు నన్నేడి పగయేల?

ఉ. అన్న శమింపుమన్న, తగ దల్లుఁడు గాదిది, మేనకోడలా
మన్న నసేయుమన్న, విను మానినిఁ జంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనఁగదన్న, మహాత్ములు పోవుత్రోవఁ బో
వన్న, భవత్సహోదరి గదన్న; నినున్ శరణంబు వేఁడెదన్.

కంస—అవి యన్నియుఁగట్టిపెట్టుము. దీనినా విడుచుట ? పుత్రుడో పుత్రికయో నీ యెనిమిదవచూలు నాకు మారకమని వింటిని. కాన విడువను. ఊరక శిశువునిచ్చి యావల నిలువుము.

దేవ—అయ్యో సహోదరుడవే! నాకోరిక యింతమాత్రము చెల్లింపరాదా? కట్టా! నాగర్భమునకు జిచ్చుపెట్టితివి. నా యార్గురు నందనులవధించితివి. అంతట తనివిదీరక నొక్కయాడుపడుచు అబల గసిగందువును సైతము చంపయత్నించెదవే? అన్నా! నీమది కేల కరుణగలుగదు? నా పాపఫల మిట్లుండ నిన్నేల యనవలయు? ఆహా చంపెడి పగవానికైన నించుక యక్కటికము గలుగు గాని నీకు గలుగకున్నదిగదా?

అనుబంధము 19

అన్నా! నిను చెఱగొడ్డి వేడెదను. నాకు పుత్రికాభిక్షమిమ్మని నిన్ను చీర లిమ్మని వేడను, సొమ్ములు కావలయునని యపేక్షింపను,మణిమయమందిరమ్ములు కట్టించి యిమ్మని కోరను. భూములిమ్మని ప్రార్థింపను. ఈ కన్నియకు ప్రాణదాన మొసంగుమని ప్రార్థించెద. అంతమాత్రము చెలియలిపై కరుణించిన దప్పగునా? అయ్యో! ఒక్కరినిగాదు; ఆఱుగురిని నీకుబలియిచ్చితినే? ఇంకను తనివిదీరలేదా ? ఈచిన్నబిడ్డపైన గనికరము లేకున్నమానెగాని నీసహోదరిపైనైనను గరుణ గలుగదా! అక్కటా! పశువుల నరికి రక్తమాంసముల విక్రయించు కటికవాడైన నొకపరి తన పశువునందు దయ

వహించుచు గాని నీవు కావు కావుమని వాపోవు పసికూనల యాక్రందనమునైన వినక ఖండించెదవే? నా యిదొక్క ప్రార్థనము గైకొనుము.

సీ. ఇన్నాళ్ళు చెరసాలకన్న హింసలఁ బెట్టి
యెంతైన సంతోష మెనయలేదే
కన్నీరు మున్నీరుగా మేము శోకింపఁ
గటికి మానస మింత కఱుగ లేదె
కన్నులు తెరవని చిన్నిపాపల నీకు
బలియిచ్చితిని తృప్తిగలుగలేదె
నేఁ డిదే నీమేనకోడలే వేడదే
యీడులేని కరుణఁ జూడవలదె

గీ. మానుమా యిఁకనైన నీకూనఁ గనుచు
మానునీపాదమాన నే మానమాన
హీనమా, విధానమ, నీప్రమాణమాన
మానదీన మానిని, నుమాన వేళ.

నాపుత్రిని నా కిమ్ము. ఇదె నీచరణములపై బడి వేడెద. (అని కాళ్ళపై బడును.)

కంస—ఛీ! ఆవలపొమ్ము (అని కాలదన్ని) అల్లుడు కాడట! మేనకోడలట! ఎవ్వరైననేమి? నే చంపనేవలయునని ప్రతిన పట్టిన యాప్రతిన విడచుట నా జాతమున వ్రాయనిపని. దానివి విడిపించుట నీకుగాదుగదా నిటలాక్షునకైనను శక్తి చాల దనుకొమ్ము. ఎన్నఁడు నీశిశువులు నాకు శత్రువులని నారదుడు వచించెనో యాదినమే నీతనయులు నాఖడ్గధారకుఁ జిక్కినవారే. నాకు నీవు చెల్లెలివి కావు. నేను నీ కన్నను గాను. నీవు నా ప్రాణములకై జనించిన మారివి. పగదాయివి.

ఘాతకివి, నిన్ను సంహరించి నాకులమును నామానసమును నిష్కల్మషముగా నొనరించెద. మితిమీరి పల్కిన నీవును నీపెనిమిటియు మృత్యుముఖమునకు జిక్కినవా రనుకొమ్ము. నన్నిక 'యగ్రజా!' యని సంబోధింపకుము. నేనగ్రజుడను గాను. నిన్ను నీతనయులను పొలిపుచ్చుటకై జనించిన ప్రేతనాయకు డనుకొమ్ము.

అనుబంధము 20

దేవ—ఓరి! ఇంత బ్రతిమాలుచున్న నీసోదరిని చరణాహతిబడద్రోసితివా? మదాంధా! నన్ను దన్నిన నీయవయవంబులు దిక్కులేక మహావ్యాధిచే నూడి సంబంధములు వీడి పురుగులుపడి శ్మశానంబున కాకంబులుసైత మంటకకుళ్ళి, దుర్గంధముపట్టి ముటిగిపోవుగాక. నీచాత్మా! ఆడుబిడ్డల కన్నీరన్న నూరక పోవదుసుమా, పుట్టినింటిని గాల్చినకాని చల్లారదు. నేను నీ పాలికి మారినైతినిగదా. ముందునీకు రాబోయెడి దురవస్థను నీనోట నుడువు చున్నాడవు. ఆటులనే కానిమ్ము. నీ పాలికి మహామారి నయ్యెద, నేను చెలియలిని కానా? ఔనా? నిక్కమువచించెదవా? నీమనఃపూరకముగ నాడెదవా? నీకు నే జెలియలిని కాను. కాజాలను, కానోపను. దురాత్మా! పుత్రఘాతకా! చేయుము. నీవలసిన పాపము లన్నియు, నా గర్భదవానలము నిన్ను మొదలంట కాల్చక మానదు.

కంస—పాపినీ! కులపాంసనీ! దూషించెదవా? నీ వింత వట కాడిన యవాచ్యములై, యతిపాపములై, యన్యాయాకరములై యున్ననీ మాటల నాలించుట తత్కాలమున జనించిన

మహత్తర క్రోధభవనిశ్చేష్టాభరమున సంభవించిన తూష్ణీభావ బుద్ధిచేగాని. నీయసమంజసవాక్సరణి నంతయు గొనసాగ నాకర్ణించు నభిలాషమునగాదు, ఇక నొకమాట నీనోటినుండి వెలువడిన నీనాలుక కోసెద.

దేవ——పాపాత్మా! నేనన్యాయరీతినుగ్గడించితినా? అధర్మమునుభాషించితినా? నానాలుక గోసెదవా? ఇట్టి దురుక్తు లాడిన నీ జిహ్వాగ్రమును మనవృత్తముల దిలకించుచున్న ధర్మదేవతలు ఛేదింతురుగాక. నీపాపకార్యములను, నీయధర్మమును జగ మెఱుగు. ఛీ! నీతోమాటలాడిన దురితమగును. ధర్మాధర్మముల తత్త్వమును బరీక్షించి కాంచెడి కర్మసాక్షి యొక సాక్షి కాడా? ఈసభాస్థానముననున్న సింహాసనాధి దేవతయొక సాక్షిగాదా? కార్యానంతరముననైన తత్ఫలానుభవవేళ నైన నెఱుక గలిగించు నీయాత్మసాక్షి యొకసాక్షిగాదా? కానిమ్ము నీముఖము పాపకరము. నీనిలుపు పాపకరము. వేయేల! నీ జన్మము మహాపాప నిలయాలవాలము. నీవు నన్ను పాపిని యనెదవా! నీవు నన్ను జంపెదనను భయము నాకించుకయైనను లేదు. నాపతి సన్నిధానమున సుమంగలీ మరణ సుఖమును పరమ సంతసమున భరించెదగాని నీపాపపు మోము జూడనోప.

కంసు——ఆహా! పాపినీ! చచ్చితివి. రమ్ము. నిన్నుఁ జంపినగాని నీ దురుక్తుల విడువవు (అని పైనుఱికి వెండ్రుకలబట్టి క్రిందకీడ్చి ఖడ్గము నెత్తును. సభవా రందఱు దిగ్భ్రమమున జూచు చుందురు.)

అనుబంధము 21

దేవ——(ఏడ్చుచు) సభాస్తారులారా! పౌరులారా! దేవవర్గములారా! ఈ పాపాత్ముని గంటిరే?

సీ. ధర్మంబు పాలింప ధర్మపీఠమునందు
సన్ని వేశించిన సభ్యులారా!
దుష్టుల శాసింప శిష్టుల రక్షింపఁ
గ్రాలెడు సత్యాధికారులార!
"సత్య మేవ జయతి సత్య మిదం" బంచు
దివి మించు శ్రీసత్య దేవులార!
ప్రత్యక్షదైవమై వరధర్మమునుఁజూపు
సింహాసనన్యాయసిద్ధులార!
గీ. కంటిరే యిట్టిపాపంబు కన్నులార!
అన్న యఁట. చంపునఁట చంపునంచు వెఱచి
తనయ నోసఁగుదునంట యో యనఘులార!
మీరు కరుణను పాలింపరారె లేరె!

వీని ప్రమందించి నామనస్సంతోషము జేయువారు లేరే? వీని యాంగ్రము విధవలై ఘోరదుఃఖ మనుభవించుకాలము రాదే?

సీ. కలుగడే మాకెందు ఖలుల శాసింపంగ
నేర్చువాఁడు శుభంబుఁ గూర్చువాఁడు
మాబాలఁ బ్రోవఁడె మహితభక్తుల పాల
కలుగువాఁడు మహాబ్ధి మెలఁగువాడు
మాబాధమాన్పఁడే "మాం పాహి" యనువారి
పెనుచువాఁడు నఘంబు నణచువాఁడు
మాకు తోడై రాడె మహీనాథుల బుద్ధి
నెంచువాఁడు తనంత మించువాడు
గీ. కరుణగలవాఁడు, భువిలేఁడు కలిమి లేఁడు
అకట మన్నీఁడు, మన్నిటియల్లువాఁడు
మమ్ముఁ గావఁడె, మనుపడే, మదిని గనఁడె,
తలపఁడే, రాడె యేలఁడే దయను గనఁడె.

కంస——తెమ్ము నీ బిడ్డను, నీకన్నులెదుట దాని రక్తధారను నీచేఁ ద్రావించెద. నన్ను దూషించినందుకు నీ కదియే ప్రతిఫలము. (అని బిడ్డను గుంజుకొనును. వసుదేవుఁ డొకచేతిని దేవకి యొక చేతిని బట్టుకొని యేడ్చుచుందురు)

దేవ——నీకీనిసువు నివ్వను. పరమాత్మా! దేవాదిదేవా! నాకుమారిని గాపాడుము.

వసు——దురాత్మా! విడువు మా చిన్ని పాపను.

కంస——నే విడుతునుగాని నాఖడ్గదేవత విడువజాలదు.

దేవ——అటులనే నిన్ను రౌరవాదినరకములుకూడ విడుజాలవు.

కంస——ఇట్లాడిన మీయసువులు మీయందుండజాలవు (అని కంసు డాబిడ్డను పైకెగవేయును. ఆపడుచు పైకి నెగసి పుష్పాలంకృతయై యాకసమున నిలుచును. దేవకీవసుదేవులు మూర్ఛనొందుదురు.)

శక్తి——ఓరీ కంసా! నన్ను నీవేమియు జేయజాలవు. నేను నీకొఱకయ్యే జనించియున్నదానను. కాళియన, మారియన, శక్తియనిలోకసన్నుతవైభవమున వెలయుదాన. నిన్ను చంపువాఁడప్పుడే యుద్భవించియున్నాఁడు. ఇక నీవు మనజాలవు. (అనగా కంసుడు మొదలగువారలట్టె యాశ్చర్యమున నిలుతురు)

అనుభంధము 22

యవనిక జారును.



శ్రీ

# కృష్ణలీలనాటకము



## తృతీయాంకము



1 వ రంగము : రేపల్లెలో యశోద మందిరము.

[ప్రవేశము : కమల కళావతియను నిరువురు గొల్లముత్తైదువలు]

కమ—చెలీ కళావతీ! ఇన్ని దినములకు మన యశోద చిన్న మగవాని కనెనట. ఆచిన్నవాడు పుట్టిన నాల్గుమాసములకే నడవ దొడగెనట. అయిదవమాసమందే ముచ్చటగ మాటలాడ సాగెనట ఇది యేమబ్బురమే!

కళా—అదేమి యరుదే? ఆ బాలుడు దేవాంశ సంభూతుడని మన పురోహితులు చెప్పలేదా! ఇది యట్లుండనిమ్ము! కమలా! మన యశోద యేమో పుత్రవతి యయ్యెను. ఇక నీవెన్నడు ప్రసవించెదవే?

కమ—చాలునే నీహాస్యము. అదియుండనీ. మన నందునిదే యదృష్టము. మొదటి భార్య రోహిణీదేవి యొక బాలుని, రెండవ భార్య యశోద యొక బాలుని గనిరి. ఒక్కటేతూరి యతడిరువురు కొడుకుల తండ్రి యయ్యెగదా!

[ప్రవేశము : శీఘ్రయానమున యశోద]

యశో—(కళావతిని చూడకయే) కళావతి వచ్చినదా?

కమ—(కళావతిని జూచి) ఇదిగోనమ్మా! ఇక్కడనేయున్నది. మేమిరువురము కలిసియే వచ్చితిమి.

కళా—(ఏకసక్కెముగ) కలుగక కలుగక నీకు మగచిన్నవాడు కలిగి యుండు టేమి! ఇంట నామకరణమహోత్సవము జరుగు చుండు టేమి! మాబోటి బీదవారు కంటబడుట యనగనే మమ్మా!

యశో—కళావతీ! నేను నిన్ను జూడ లేదే; దానికై యింతనిష్ఠురమా?

కళా—ఇప్పు డెట్లు చూచెదవమ్మా?

యశో—నీ కెప్పుడును నిష్ఠురము సహజమే పోనిమ్ము, కమలా! మన విద్యుల్లేఖ కింకను దీరిక కాలేదేమో?

కమ—అమ్మా! ఆమె మావలెనా? గొప్ప యుద్యోగస్థుని భార్య, ఇంట వంటలు వార్పులు చేయుంచి, పరుపులు గిరుపులు వేయించిన పిదప జ్ఞాపకమునకు వచ్చిన వచ్చును.

యశో—అదిగో! తలచుకొను వేళ కేవచ్చె. విద్యుల్లేఖా! నీకునూరేం డ్లాయుస్సమ్మా! ఇప్పుడే నీమా టనుకొంటిమి. ఇంతలోనే నీవును వచ్చితివి.

విద్యు—లేదమ్మా! అప్పుడే వచ్చుచుంటిని. మాయెదుటింటి కామాక్షి "నేనును వచ్చెదను. కలిసి పోవుద" మని చెప్పెను. ఎంత సేపు వేచినను ఆమె రాదాయె. వేసరకొని నేనే వచ్చితిని.

యశో—ఇప్పటికాలమువారికి కార్యములయందు దృష్టియే లేదమ్మా. మఱియు నూరిబయట విహరింపబోవుట, వార్తాపత్రికలం జదువుట, రచ్చటదుగున గూర్చుండి యూరివారి పురాణముల జదువుట, అది యుండనీ, పేరంటాం డ్రందఱు వచ్చినట్లే యయ్యెకదా? ఇంక ప్రారంభింతమా?

[ప్రవేశము : సరోజిని]

కమ—కానిమ్ము. త్వరగా పేరంటము చేసికొని ప్రొద్దుకలుగ నింటికి బోవలయును. ఇప్పటికాలము చెడ్డది.

విద్యు—నిజము యశోదమ్మా! ఏదీ నీకుమారుని జూపక పోయితివే? నేనే వచ్చి చూతమన్న నిల్లు చాలదూరము. అందులో వేసవికాలము. ఎండ ప్రబలినందున రాజాలక పోతిని. పిలి పింపుము.

యశో—పిలిచెదనమ్మా!

అనుబంధము 23

[ప్రవేశము : శ్రీకృష్ణుడు తాళము వేసికొనుచు, అందఱు నెత్తి ముద్దాడుదురు]

యశో—(కృష్ణుని పీటపైఁ గూర్చుండబెట్టి) కమలా! నలుగుపాట పాడవే.

కమ—నాకు రాదమ్మా సరోజినీ! నలుగుపాటలు పాడుము.

సరో—ఏ మొయ్యారమే పాడుమంటే? ఈ యొయ్యారములు మే మెఱుగ మమ్మా!

కమ—ఒయ్యార మేమే? మొన్న రాధ సమర్తాడినపు డెంత బాగుగ పాడితివి. చూడుము. ఆపాట పాడుము. పోనీ కళావతీ! నీవు పాడుము,

కళా—నాకు క్రొత్తకుండలోని నీళ్ళు త్రాగి గొంతురాసిన దమ్మా. "ఆ" యన నియ్యదు.

యశో—సరిపోయె. సంగీతపాటకులకిది మొదటిరోగము. విద్యుల్లేఖా! నీవు పాడుమమ్మా. నీకును నాకును దప్పినది కాదు.

విద్యు—బాగుగ నున్నది. నన్నా పాడుమనునది? అవ్వను బట్టు కొని వసంతము లాడెనట.

కమ—నిజమే! నీమగడు యాదవసింహుడు వసంతమాట విడిచెనా?

విద్యు—చాలునే, ఊరకుండుము,

యశో—మీరేలకొట్లాడెదరు నేనే పాడెదను లెండు, (అని కృష్ణుని తొట్లలో బరుండబెట్టి)

అనుబంధము 24

శ్రీకృ—(ఉయ్యాలలోనుండి దిగ్గున లేచి) లక్ష్మణా! తెమ్ము నాధనువు. తెమ్ము నా చాపబాణములు. ఈసముద్రము మదమణచెద. ఎంత ప్రార్థించినను దారి యివ్వకున్నది.

అనుబంధము 25

(గోపకాంతలు నిశ్చేష్టలై చూచుచుందురు)

[ప్రవేశము-శీఘ్రమున నుద్ధవుడు]

ఉద్ధ—దేవా! కోపము చాలింపుము. కోపము చాలింపుము. నీవు రామావతార మొందినతఱిసముద్రముపై జూపినకోపమును జూపుచున్నాడవు. ఇది రామావతారముకాదు. కృష్ణావతారము. రామావతార కధను మీతల్లి పాడుచున్నది. ముఖ్యభక్తుడు ఉద్ధవుడను విన్నవించుచున్నాడను.

అనుబంధము 26

శ్రీకృ—ఉద్ధవా! లెమ్ము నిక్కము. నే రామావతార మనియే భావించి యున్నాడను. అమ్మా! అమ్మా! ఇదేమి యింత భయంకర రూపము! నాకు భీతి కలుగుచున్నది.

యశో—(కృష్ణునిఁ గౌఁగలించి ముద్దాడి) ఏమిభయమును గంటివి నాయనా! ఏమి కనుపించెను?

సీ. కలలోన నేరూపు గంటివో గోపాల!
పడరాని భయ మీవు పడితివన్న

శ్రీకృ—కలలోన జగములే కంటినే నోతల్లి
భయమెక్కడిది యంత భ్రాంతియమ్మ

యశో—ఎక్కడి రాముండు నెక్కడిలక్ష్మణుఁ
డేమేమొ పలికితి వేలకృష్ణ!

శ్రీకృ—రాముఁడ నే గాదె రహి లక్ష్మణుఁడ. నేనె
యాశ్చర్య మిం దేమి యలరునమ్మ;
యశో—గీ. ఏటిమాటలో నాయనా! యెఱుకపడవు
శ్రీకృ— మాటలన్నియు నావెగా బూటకములు
యశో— పిచ్చియిది యేమొ తెలియదు వెఱ్ఱికృష్ణ
శ్రీకృ— పిచ్చి వదలినఁ గాంతువే పిచ్చితల్లి!
కమ—యశోదా! మంచికొడుకును గంటివి. ఇదియేమి రాముడే పిచ్చిపట్టిన చందమునఁ జేయుచున్నాఁడు?
కళా—చెప్పలేదేమే? ఇతని వృత్తాంతము మిక్కిలి యాశ్చర్యమని.
విద్యు—ఆశ్చర్య మటుండ మన బాలుడు భయపడినాడు, రక్ష పెట్టవలెను.
యశో—ఔనమ్మా రక్ష పెట్టవలెను, దేవగృహమునకుపోదమురండు.
(అని యందఱు నిష్క్రమణము)

[ప్రవేశము-పూతన]

అనుబంధము 27

పూతన—ఆహా! ఇదియే కదా నందునియిల్లు? ఇప్పు డా కుమారు నెత్తుకొనిపోయినదియే గదా యశోద? అల్లదే తల్లికౌగిట జేరి ముద్దు లొలుకుచు నవీనావతార మొందిన యభినవకంద ర్పునిబోలె వెలయువాడెగదా ముద్దులకృష్ణుడు? ఈ చిన్ని కసిగందువా మాకంసుని వధించువాడు? ఔరా! ఒక పంటఁ జప్పరించిన జాలని యీకుఱ్ఱనికై యాకంసుడు రాత్రింబవలు బరితపించుచున్నవాడు. "దేశ దేశములు వెదకి పల్లె పల్లెల నన్వేషించి యిల్లిల్లు నెమకి యెం జానందుని పట్టియున్నను ద్రుంచింపు" మని నాకు గట్టికట్టడియొనర్చి యున్నవాడు. వీని సంహారించుటకుఁ నేఁగావలయునా? మాకంసుఁడెంతటి వెఱ్ఱిరాజు! అయిన నేను నిజస్వరూపముతో పోయిన నచ్చట

నున్న గోపిక లందఱు భయపడుదురు. కావున నేనును నొక యాదవాంగనరూపమును గైకొని యాపసిపాపని నెత్తికొని, యిదివఱకే నా స్తనసీమ ధరించిన విషము నెట్లయిన ద్రావించి మడియించి మారాజు మెప్పు వడసెదగాక.

(అని నిష్క్రమణము)

[పునః ప్రవేశము : యాదవాంగనలు]

యశో—కుమారా! యెంత భయపడితివమ్మా?

శ్రీకృ—ఏమియు లేదే?

యశో—మాటలన్నియు నావే. నేను మాట్లాడక యింకెవరు మాట్లాడవలయు?

[ప్రవేశము : మాయాపూతన]

అనుబంధము 28

యశో—అమ్మా! రమ్ము కూర్చొనుము. ఎవరు నీవు?

పూత—అమ్మా! మాది యిక్కడనే యొకపల్లె, ఈయింటి పేరంటాండ్రేమో పాడుచున్న వినవచ్చితిని.

యశో—అట్లనా? అమ్మా! రమ్ము కూర్చొనుము. కమలా! పోవే. కుంకుమ, పసుపు, తాంబూలము తెచ్చి యియ్యవే.

కమ—(పోయి పైవానిని దీసికొనివచ్చును)

యశో—అమ్మా! బాలుని జూచెదవా? ఇదిగో యెత్తికొనుము.

పూత—(బాలు నెత్తుకొనిముద్దాడి) అమ్మా! ఈబాలునకెన్ని యేండ్లు

యశో—ఎక్కడిదమ్మా! మూడవయేడు.

పూత—అమ్మా! నీకుమారుడు మంచి లక్షణవంతుడు. లక్షణము లన్నియు బాగుగా నున్నవి. మంచిశక్తివంతుడు నగును.

శ్రీకృ— అమ్మా! నాశక్తియీయామెకు బాగుగా తెలియును. తెలియకున్న ముందైనను తెలియగలదు.

గీ. అమ్మ! యీమెకు నాలీలయంత దెలియు
నీమెకును నాకు స్నేహం బదెంతొగలదు
పూని యీమెకుమారకు డేనె యగుదు
నింక పరలోక సుఖముల నిత్తునమ్మ.

పూత—ఇదియేమమ్మా? యీ యీడునకే యిట్టిమాట లాడు చున్నాడు? వీడు మిక్కిలి మాటలమారియగును (అని చన్ని చ్చుటకు ప్రయత్నించును)

యశో—అమ్మా! బాలునికి స్తన్యమిచ్చెదవా? ఆ మరుగున కూర్చుండి పాలిమ్మ.

శ్రీకృ—అమ్మా! యీమెనాకు చనుపాలొక్కటియే కాదు. తనకున్న వన్నియు నిచ్చును. ఈమెకు లేనివన్నియు నే నిచ్చెదను (శ్రీకష్ణునితో మాయాపూతన నిష్క్రమించును. గొప్పధ్వని వినబడును. శ్రీకృష్ణుడు స్వస్వరూపమున నున్న పూతన నీడ్చుకొనివచ్చి రంగమునఁబడవైచును)

యశో—(ఆతురతతో కుమారు నెత్తుకొని) కృష్ణా! కృష్ణా! ఎవ్వతె యీరాక్షసి, నీవీడ్చుకొనివచ్చితివి? ఇది చచ్చుటకై తన్నుక లాడుచున్న దే? దీని నెవరు చంపిరి? ఏమో నీచరిత్ర మొక్క టియు నాకు దెలియకున్నది. రాజీవముల గేరుకన్నుగవ. లేత వీరుల చూచినంత భయమ్మునొందు నీవీ భయంకరాకారము నెట్లు గాంచితివి? నెత్తావివిరజాజుల తాకినంతట పసివాళ్ళు వాడు నీకరపల్లవములు క్రూర రాక్షసీకఠినతరాంగము నెట్లు స్పృశింపగలిగె?అన్నా! తెలిసియు తెలియనివానివలెనున్నావు.

సీ. నవశిరీషసుకాంతి నిరసించు నీమేను
రక్కసిచే నెంత స్రుక్కెనన్న
స్థలపద్మకాంతి నేత్రములాడు కన్గవ
యెటుల సంభీతి చలించెనన్న

అతిసుధాప్రసరాభి హాసులౌ లేదౌడ
లంద మదెంతగా కందెనన్న
నళిననాళవిభూతి నలరారు చిరుబాహు
లడఁగి యెట్టులకాంతి విడిచెనన్న

తే. గీ. కటకటా! యిదియెట్టుల కలిగెనన్న
ఎంచ నేపాపిమొగ మిందుఁ గాంచితన్న
చిన్నిపాపఁడ నాప్రోడ చిఱుతరేడ
రమ్ము రమ్మన మాయన్న రాగదన్న.

శ్రీకృ—అది నాకే తెలియదు. నీకెట్టు తెలియునమ్మా?

చ. తెలిసినవాఁడగాను మరి తెల్విని బాసినవాఁడగాను న
న్నెలిసినవారు లేరు మది తెల్వియె నే నటు నాక్రియాదులే
తెలియును దానితత్త్వమునుఁ దేటగఁగాంచిన పెద్దవార లా
తెలివిని గాంతురమ్మనగఁ ద్రెంపఁగ జాలుదురమ్మ యమ్మరో!

యశో—కమలా! పోవే మావారిని దోడ్కొనిరమ్ము.

కమ—(పోయి నందుని నవనీతుని బిలుచుకొనివచ్చును)

నంద—(ప్రవేశించి పూతననుజూచి) ఆహా! ఇదియేమి విపరీతమో తెలియదయ్యో! ఓరీ నవనీతా! మన గర్గాచార్యులవారిని బిలుచుకొనిరమ్ము. (నవనీతుడు పోవును)

నంద—కామినులారా! ఏమి యీ యనర్థమునకు గారణము?

యశో—మేమందరము మనకృష్ణునికి జోలపాట బాడుచుండ నెవ్వతెయో స్త్రీవచ్చి బాలునికి బాలివ్వ గొప్పధ్వని గలిగెను. అంతలో నీయనర్థము గలిగెను.

[ప్రవేశము : గర్గాచార్యుడు]

గర్గ—అయ్యా! ఏలపిలిపించితివి? (పూతనను జూచి) ఆహా! ఏమి? యీపూతన యిక్కడ చచ్చిపడియున్నది? దీని నెవరు చంపిరి? దీని దర్శనమన్న మృత్యుదర్శనమే?

యశో—ఆహా! ఇదియా పూతన? స్వామీ! ఇది యంతయు మా కృష్ణుని చరిత్రము.

గర్గ—అట్లు చెప్పకుడు. ఇదియంతయు కృష్ణలీలయా? ఇది పూతన యను రక్కసి. కంసునకు కూర్చుదాసి. యోజింప నాకంసుడే మన కెగ్గుచేయదలచి యీ పూతనను బంపియుండనోపు. మన కృష్ణుండు దీనిపని దీర్చియుండవలయును.

నంద—స్వామీ! ఇదికల్ల. ఈరక్కసి యనగనేమి? ఈ బాలుడు చంపుట యనగనేమి? నేను నమ్మజాలను. ఈ పాపని కేమియు దెలియదే. ఇట్టివాని కెవ్వరు బాధ కలిగించిరో?

శా. లేరే బాలకు లెందు వారిని గనన్ లీలావతుల్ రారె యిం
పారన్ కౌఁగిటఁ జేర్పరే ముదమునన్ బాలివ్వరే చూడరే
వారేరీ పసిపాపలకా దునుము పాపవ్రాత్యా లీపూతనన్?
ప్రేరేపించిరొ పాపచిత్తులకు నే వేళకా దయల్ గల్గునే.

శ్రీకృ—చూడుము. నాకేమియు దెలియదే. ఈయన యేమో చెప్పుచున్నవాడు.

గర్గ—అయ్యా! నీకేమి తెలియును? లోకమునందలి తెలివి యంతయు నీవేకావా? నిన్ను దెలిసికొనువా డెవడు? నందాదులారా! యీ వృత్తాంత మంతయును వచించెదను రండు.

యశో—స్వామీ! వృత్తాంత ముండనిండు. ఈబాలు డీరాక్షసుని జూచి యెంతభయపడెనో యేమికీడు రానున్నదో యని భయమగుచున్నది. తా మనుగ్రహించి కొంచెము మంత్రింపుడు.

గర్గ—కుమారా! రమ్ము. మంత్రించెదను. మంత్రమును మంత్రస్థమును మంత్రఫలమును నిన్నే కదా చేరవలయును.

(నిష్క్రమణము)

తృతీయాంకము—2 వ రంగము

రేపల్లియందు నందగృహము

[ ప్రవేశము : యశోద ]

యశో—మాకృష్ణుని యుదంతము పరమాద్భుతముగా నున్నది. "మూర్తి కొంచెము కీర్తించెను" యన్నట్లున్నది. వచ్చియు రాని మాటలతో నున్నను, కార్యముల వాఙ్మానసగోచరము లుగానున్నవి. మొన్న పూతనను బరిమార్చుట యన్ననో చెప్పనలవియే కాదు. ముచ్చట లాడుచుండ మాటలమృతపు తేటలై యున్నవి. ఇట్టి మురిపెముల మూటగట్టు మాకృష్ణ య్యనొక్క నిమిషము విడనాడవలయునన్న నాకు సాధ్యము గాకయున్నది. గార్గాచార్యులు వచించెడి తీరునంత నతడు దేవాంశసంభూతుడనియు నీ గోపాలకృష్ణుని మహిమ మా బోటివారికి నైతము తెలియదనియు వచించిరి. నా కేమో యీ కుమారునియం దొకతూరి భక్తియు నొకపరి పుత్ర వాత్సల్యమును గలుగుచున్నవి. లేక లేక సంతానము గలిగి నందున కీ పిచ్చిభ్రాంతి గలిగియుండునా ! యుద్ధవకుమారుడు యాదవబాలుడు తనకు భక్తుడట; తాను వాని కుపదేశించు వాడట. అదేమియో యింత విచారింప వలయును. ఏదియెట్లున్న నేమి ? లోకమున బుత్రకుల ముద్దాడ గలిగినవారి భాగ్యమే గదా భాగ్యము.

సీ. నిజసుతకటిసూత్ర నిర్మలభాస్వర
మణిశోభితాంక సద్వాదిత వనిత
పుత్రక పరముఖాంభోరుహా వ్యక్తసం
లీలానుభాషణాలోల బాల

ఆత్మీయనందనహారి నూత్నకపోల
విధుబింబచుంబనానిదిత ముదిత
అభిరామతనయ ప్రేమాలింగనామోద
దానభోగ్యోద్దామధామ లేమ
తే. స్వర్గసుఖపుష్ప నిచయవసంత కాంత
లలిత సుఖబంధు గౌరవాకలన లలన
నళిక నళినతనూజాతకరిణి తరుణి
కాంతిసుతయింతి విలసంతి శాంతి యింతి.

అనుబంధము 29

ఏల యింకను మా గోపాలకృష్ణుడు రాకయున్నవాడు ? (అని యటునిటు చూచి) అదిగో వచ్చుచున్నవాడు మరుగుననిలిచి వీనిచర్య చూచెదగాక. (అని మరుగున నిలుచును)

[ ప్రవేశము : శ్రీకృష్ణుడు ఉద్ధవునితో పాడుచు ]

అనుబంధము 30

శ్రీకృ—అమ్మా ! అమ్మా ! (అని నలుదిక్కుల జూచి) ఎక్కడ పోయియున్నది. మాతల్లి ? ఓహో ! ఆమె కాశ్చర్యము జనించి యున్న దేమో ?

ఉద్ధ—దేవా ! అన్నియాశ్చర్యములకు మూలము నీవుగదా? నీకంటె వే రాశ్చర్యము గలదా ?

సీ. ఎదనిందిరాదేవి నిడియు నీఘనరూపు
చూపని యాశ్చర్యశూరుఁ డీవె
శ్రుతులందు నడచి నీ చిత్రంబు చూపక
చరియించు నాశ్చర్య పురుషుఁ డీవె
సనకాదిహృదయంబులను నిల్చి చిక్కక
పారిన యాశ్చర్యచోరుఁ డీవె
జగముల నీవయై జగముల నంటని
యాశ్చర్య గారడి యనగ నీవె

తే. అన్ని యాశ్చర్యముల మీఱి యవనిఁ జేరి
కేరి యాశ్చర్యక్రీడల వారివారి
పాత్ర లాడించు నాటక సూత్రుఁడీవె
సవ్యదుణబృంద ! గోవింద ! నందనంద !

శ్రీకృ—ఉద్ధవా ! మాతల్లికి పాలుత్రాగుదునా పాయసము తిందునా యని సందేహము కలగినది.

ఉద్ధ—కృష్ణా ! నిన్ను గుమారునిగా పొందిన సందేహము లుండ గలవా ! ఇంతకు మీ తల్లి యెక్కడనున్నది ?

శ్రీకృ—ఎక్కడనున్నది ? మనమాట లాలింపవలయునని యందు మఱుగును దాగియున్న మాతల్లి నెక్కడ చూపగలను ?

ప్రదేశము : శ్రీఘుయానమున యశోదపాడుచు

అనుబంధము 31

యశో—(కృష్ణు నాలింగనము జేసికొని ముద్దాడును)

శ్రీకృ—జననీ ! యెక్కడనుండి వచ్చితివి ?

యశో—కుమారా ! యెక్కడనుండి వచ్చితి వననేల ? నీకు తెలియదా ? యది యుండనీ, నీవెక్కడపోయియుంటివి నాయనా? అల్లెక్కడికిని బోవరాదు. ఇంటివద్దనే యాడుకొనుచుండుము. చూడుము మొన్న పూతనయనురాక్షసి నిన్నెంత బెదరించెను?

శ్రీకృ—అవునమ్మా దానిన జూచినంతనే భయమగుచుండెను. ఇంక నేను వెలుపల పోవనే పోవను. లోపలనుందును కాని నాకొక బంగారుబండి నిప్పింపుమమ్మా !

అనుబంధము 32

యశో—నాముద్దులయ్య ! నాకృష్ణస్వామి ! ఏమి మాటలయ్యా యివి ? అన్నియు నిచ్చెదను లెమ్ము. (అని ముద్దుపెట్టుకొని) ఇంక పండుకొనుము.

శ్రీకృ—చూడుమమ్మా! మరి-మాయన్న రాముడు, నందరు పిల్ల వాండ్రు నన్ను 'పూతనను జంపినవాడు' 'రాక్షసిని జంపిన వా'డని యెగతాళిజేయుచున్నారు.

యశో—ఏమో? ఉండిన నుండవచ్చును. నాయనా! నీవుగాక మరి యెవరు చంపిరి.

శ్రీకృ—లేదమ్మా! నేను కండ్లు మూసుకొనియుంటిని. మీరుగట్టిగా నరచిరి. అందుకే యది చనిపోయెను. నాకేమి తెలియునమ్మా?

యశో—నీకేమియు దెలియదా! కానిమ్ము.

(అని కృష్ణుని నొక మంచముపై పరుండబెట్టి పోవును; కృష్ణుడు నిద్రించునట్లు నిద్రించి తల్లిపోవగనే లేచును)

శ్రీకృ—ఉద్ధవా! ఇటురమ్ము మన మాటకు బోవుదమూ? మన చెలికాండ్రెక్కడ నున్నారో పిలుచుకురమ్ము.

ఉద్ధ—స్వామి! మీ తల్లి వలదని చెప్పిపోయెను? మన మాటలాడ బోయిన నామెకు కోపమురాదా?

శ్రీకృ—పోవుదము రమ్ము! మాతల్లికోపమును నేను తీర్చలేనా?

(ఉద్ధవునితో నిష్క్రమించును)

(వెనుక యవనికనెత్తగా నొకపూదోట కనిపించెను)

[ప్రవేశము : శ్రీకృష్ణుడు బాలకులతో పాడుచు]

అనుబంధము 33

శ్రీకృ—మీరందఱు నేను చెప్పినట్లు వినవలయును. నేను రాజును మీరందఱు నాసేవకులు. నేను రాజ్యము నేలునట్లును మీరు నాయాజ్ఞకు లోబడినట్లు నాడుకొందము రండు. ప్రజలకు రాజభక్తియే పరమభూషణము, పరమశ్రేయము. శిరమున ధారణీయము.

సీ. పాలించు రాజన్న పరమదైవముగాఁగ
భావించి పూజింపవలయుఁజుండి
అరయ రాజాజ్ఞ దైవాజ్ఞగా నెంచుచు
లలి శిరంబున దాల్ప వలయుఁజుండి
భూపతి కెందైనఁ దాపంబు కల్గిన
తెలిసి దానినిఁ బాపవలయుఁజుండి
ధరణీశుఁ డెందైనఁ దప్పులఁ జేసినఁ
బ్రార్థించి త్రిప్పగావలయుఁజుండి
గీ. పతి హితమ్మును దలపఁగ వలయుఁజుండి
ధరణినాయకుఁ గినియఁగా తగదుసుండి
రాజభక్తిని మరువంగ రాదుసుండి
అపుడు సద్గతి మన కెందు నలరుఁజుండి.

అనుబంధము 34

[ఒక విచిత్రమైన బండి ప్రవేశించును]

శ్రీకృ—ఇదిగో! బండి. ఈ బండి బాగుగా నున్నది. దీని నెక్కి యాటలాడఁబోవుదము.

ఉద్ధ—కృష్ణా! వలదు. ఈ బండియేమో విచిత్రముగా నున్నది. బండి కెద్దులు లేవు; బండిలో మనుష్యులు లేరు.

శ్రీకృ—బండి కెద్దులెందుకు కావలయురా? ఎద్దులులేనిబండినడుచుట నీవు చూడలేదా? అది యేమి చిత్రము? ఇక మనుష్యులు లేరన్న మనము కూర్చున్న మనమే మనుష్యులము.

1. బాల—నీయిష్టమబ్బా! మేమురాము. కావలసిన నీవుపోయి యీ బండినెక్కుము. ఏయుపాయమురాకయున్న మేమునువచ్చెదము.

శ్రీకృ—బాగుగనున్నది ఒకరిమాట నొకరువినకనే మన దేశమింత చెడిపోయినది. మనమందర మొకటేమాటగ నున్న మనగతి యిట్లేలగుచుండె? నేనే పోయెదను. ఎట్లును నీబండికిని నాకును తప్పదు.

(అని పోయి బండిని కాలితో తన్నును. ఒకగొప్పధ్వని కలుగును. బండిలోనుండి నొకరాక్షసుడు వెలువడును. బాలకులు భయపడి పరుగెత్తిపోయెదరు. కృష్ణుడు రాక్షసునితో యుద్ధమాడి వాని జంపును. (యవనిక పడును)

5 వ రంగము : చందు: డను నొక యాదవుని గృహము

[ప్రవేశము : కమల, పద్మ యను వాని భార్యలు]

కమ—పద్మా! ఏమిచేయవలయునే? ఎవరై యుండవచ్చును? వీడే యైయుండవచ్చునా? ఎంత మీాగడ! ఒక నాడైన నుండనివ్వడే? ఎంతవెన్న? ఒకరికి సాధ్యమా?

పద్మ—వీడేయైయుండవలెనే, లేకపోయిన నంతలావుగా గుండ్రముగా నున్నగనుండునా? పాలుత్రాగిలావౌచున్నాడు. మీాగడతిని గుండ్రముగా నుంటున్నాడు. వెన్నమ్రింగి నున్ననౌచున్నాడు.

కమ—నీ వనుమాట నిక్కము. నాకీయనుమానము గలిగియేమూడు నెలలక్రిందట వానిపొట్ట కొలతవేసికొని యుంటిని. మొన్న చూతుగదా ఆరంగుళము లెక్కువయినది.

పద్మ—అబ్బ! మూడు నెలలలో నారంగుళములు!! అందుకే గాబోలు నన్నమే తినడు. అయిన మాయత్త మాచుట్టుకొట్టుకొను చున్నదే? దాని కేమి చేయవలెను?

కమ—కొడుకు గను కంత యభిమానము. మాతల్లి మీా తల్లి యిందుండిన నెంత బాగుగ నుండును?

[ప్రవేశము : రక్తాక్షియను చందునితల్లి మరుగున నుండి పైమాటను విని]

రక్తా— మీరు తినునదిగాక మీతల్లులు వేరేకావలెనో! తిని తిని బాగా రుచికన్నారు. ఏమి చేసేరు? మీ తల్లి లెందుకు రావలెను? మీ మగనితో కావడిలోనుంచి వెన్నమీగడ ప్రతిదినము పంపండి. వెధవముండకొడుకు, నేరుపని యేము న్నది మీ పేరనిన పడిచచ్చును.

కమ—(పద్మతో) వచ్చెనే పాడుముండ, మన మాటలు మరుగున నుండి వినినది కాబోలు? ఇప్పు డిద్దరున్నాము. కొంచెము మన చెయ్యి చూపుదము. భయపడకుము.

పద్మ—అవును. అట్లనే కానిమ్ము. నే నేమియు భయపడను. (అని కాలిపై కాలు వేసుకొని కూర్చుందురు)

రక్తా—ఏమి? నామాటలు కొంచమైనను లక్ష్యపెట్టరు? అత్తయని కొంచెమైనను గౌరవములేదు. కాలిపై కాలు వేసుకొని విఱ్ఱ వీగుచున్నారు. "భయపడకుము." అని వేరేఅంటారు. అవు నులే! మగనికే భయపడని వారు నాకు భయపడెదరా? అంత భయమున్న నింత వెన్న మీగడలో లోనపాడు చేయుచుంటిరా?

పద్మ—మేమేమి పాడుచేయలేదు. అంత నీవు నీకొడుకే.

కమ—పద్మా! అత్తగారికి మర్యాదచేయవలెనంటే ఆట్లలచేసెదవే రమ్మ. మర్యాద చెయుదుము. మహారాణి శ్రీసౌభాగ్యవతి కుంకుమశోభితురాలైన అత్తగారు. పెద్దత్తగారు దయ చేయండి. పైన దయచేయండి ఇట్లు దయచేయండి పద్మా! అత్తగారు వచ్చినారు. కుండ క్రిందవేయుము. అత్తగారూ! కుండ క్రిందవేయుదుమా? బాన క్రిందవేయుదుమా?

రక్తా—నన్ను బానక్రిందవేయుదురా ? మిమ్ము వేసెదను. పిడకల కుచ్చుక్రింద. ఇంత కొవ్వా ? ఇంత కుచేష్టయా ? హాస్యమాడెదరా ? (అని పద్మను కాలితో తన్నును)

కమ— } అహాహా ! అత్తగారి కాలికి దెబ్బ తగిలెనేమో (అని
పద్మ— } చేరియొక కాలిని బట్టుకొందురు)

రక్తా—(క్రిందపడి లేచి యేడ్చుచు) "ఒరే చందా ! చచ్చితిరా"

(అని నిష్క్రమించును)

కమ— } (నవ్వుచు) ఇంక వానిని బిలుచుకొని వచ్చునేమో? రానీ.
పద్మ— } వాడువచ్చిన నేమి చేయును ? ఊరక యెప్పుడు చూచి నను మాచుట్టు నన్యాయముగ మొత్తుకొనుచున్నది.

[ప్రవేశము : చందుడు]

చందు—ఏమి యేమి ! మాయమ్మ అట్లరచెను ? మాయమ్మఎక్కడ? ఏమి చేసితిరి ?

కమ—మేమేమి చేసితిమి ? మమ్ములనేకొట్టి తాను క్రిందబడి యేడ్చుకొనుచు పోయెను.

చందు—అంతియేనా ? సరే. మా నల్లావు యీనినది. జున్ను తినవలెనని నాకు బహుఆశ, మీరెవ్వరైనను పాలుపిండి జున్ను చేసి యివ్వండి.

పద్మ—వెన్న, మీగడ చాలకపోయెనేమో ? జున్ను వేరేకావలయునేమో ?

చందు—'వెన్నేమి ! మీగడేమి' బాగుగనున్నది. నాకేయోజనగా నున్నది. వెన్న మీగడ యెవరు దొంగలించేది తెలియకున్నది. నా కన్నమే పోదు. మీ పుణ్యము పాలు పిండండి.

కమ—నల్లావో? సరే ముందుపోయిన పొడుచుచున్నది. వెనుక పోయిన తన్నుచున్నది. మీతల్లితో చెప్పుము. పాలుపిండు మని, మేము జున్ను కాచెదము.

[ప్రవేశము : రక్తాక్షి ఒకప్రక్కన వీరికగుపడక నిలుచుకొని వీరిమాటల వినుచుండును ]

పద్మ—అవును, తన్నిన మీతల్లి నే తన్ననీ.

రక్తా—నన్ను తన్నవలెనా ? ఇంతకొవ్వా ? (అని పద్మను కాలితో తన్నును.)

కమ— } ఓహోహో! అత్తగారి కాలు నొచ్చెనేమో (అని
పద్మ— } రక్తాక్షి దగ్గఱకు పోబోవ)

రక్తా—నాకాలి దగ్గరకు వచ్చిన మీఎముకలు విరుగగొట్టెదను. కాలు పట్టి వడవేయ జూచెదరా ? (చందుని చూచి) గాడిద వెధవ, చేతకానిపంద, నీ వుండియు నన్ను దూషించుచుండ నూరకున్నావా?

అనుబంధము 35

చందు—(అందరిని సమాధానపరచి) అమ్మా! నీదేమియాక్షేపణ ? ఏమి సంగతి చెప్పుము ?

రక్తా—ఏమి చెప్పునది సీతల ? ఇంటిలోని వెన్నమీగడఅంతయు వీరిద్దరు దొంగిలించి. తిని అమ్ముకొనుచుండ నీతో నేమి చెప్పు నది ? నేనైనను మగవాడై యుండిన వీరిపని పట్టియుందును.

పద్మ—అదిగో ? మరల నీనోరేనా ? ఊరక కూయకుము. నీకొడుకే నంతయు తినిపాడుచేయునది. ఊరక మాచుట్టు కొట్టుకొను చున్నావు.

కమ—అవునవును. నీకొడుకుతింటే మాగోడు పెట్టుకొనుచున్నావు.

చందు—ఇదేమి నాప్రాణముపై వచ్చెనే ?

రక్తా—(చందుని పట్టుకొని) నిజము చెప్పుము. ఎవరుదొంగిలించినది ?

చందు—అయ్యో! గ్రహచారమా! ఇదేమి? నా కేమియు దెలియదవమ్మా!

కమ—లేకపోయిన నీమూడు నెలలో తగుం(డముగ బలియుచుంటి వేమో?

పద్మ—లేకపోయిన నింత నున్నగుం మో?

చందు—అయ్యో! నాకన్నమే లేక దిగిపోవుచున్నా నే?

రక్తా—వారనిన నేమి నాయనా! దృష్టి తీసెదను లెమ్ము అయ్యో! కొడుకా! యెంతదిగిపోతివి వీరిదృష్టి తగిలె కాబోలు.

కమ—అవునవును. మాదృష్టియే గొంతులోనొక చిప్ప గట్టుము.

పద్మ—గవ్వలు, జీడి కట్టుము.

రక్తా—చాలులే మీహాస్యము అమ్మా! నూకొడుకై యుండిన-

చందు—ఛీ. ఛీ అట్లనకుము, అమ్మా! నా కొక యుక్తి తోచుచున్నది. అట్లుచేసిన నిక్క—ము జయలుపడును. మన మందరము నే డొకచే చోటున పండుకొందము. ఎవరినోటికి వెన్న మీగడ గుర్తు లుంటున్నవో వారు తినినట్లు; చేతికిగుర్తు లుండిన వారెవరికో యిచ్చినట్లు.

రక్తా—ఇది బాగుగ నున్నది. (అని అందరు నిద్రింతురు)

[ప్రవేశము : శ్రీకృష్ణుడు పాడుచు]

అనుబంధము 36

(ఇంటిలోని వెన్నంతయు తిని రక్తాక్షి నోటికి చేతికి పూసి వెళ్ళిపోవును. తరువాత నొక రొకరుగా లేచి చూచుకొందురు. కమల, పద్మ, ముసలిదానిని దూషించెదరు)

కమ—(రక్తాక్షి కొకయద్దమును జూపును) అబ్బ! యిప్పుడు దొరికె దొంగ. లోలోననే తిని మాచుట్టు మొత్తుకొనుచుండును.

పద్మ—తనమీదితప్పు బయలుపడకుండ ముందుముందే మాపై వేసి తాను తప్పించుకొనుటకు చేసినయుక్తి.

రక్తా—(చెయ్యి చూచుకొని యాశ్చర్యపడుచుండును)

చందు—నామీదేమో తప్పెను.

రక్తా—(యోచించి) ఇప్పుడు తెలిసెను మీరందఱు నేకమై మంచి నిద్ర పట్టినప్పుడు నా కంటించిరా ? ఇంత మోసమా ? చందా! నీవుకూడ వీరిలో నొకతెవికదరా! అవునులే భార్యలే యెక్కువగాని—

చందు—అమ్మా! నీపాదములంటి చెప్పెదను; నాకేమియు తెలియదు. నాకు మంచి నిద్రపట్టియుండెను.

రక్తా—అట్లయిన నిదియంతయు వీరిద్దరిపనియా ? కానిమ్ము. ఇంకను ప్రొద్దున్నది కదా! ఇప్పుడు చేసెదను వీరిపని.

కమ—పద్మా! ఇక మన కంటించునేమో! మనము బహుజాగ్రతతో నుండవలెను. కండ్లుమూసుకొని నిద్రపోయినట్లు చేయుదము, మన దగ్గరకు వచ్చినతోడనే పట్టుకొందము.

పద్మ—అవును అట్లనేచేయుదము. నీకు నిద్రవచ్చిన నాకు జెప్పుము. నాకు నిద్రవచ్చిన నీకు జెప్పెదను.

చందు—చూచెదనీరాత్రి యేమేమింకెంత జరుగగలదో? బహుహెచ్చరికతో నిద్రచేయువానివలెనుండి యంతయు దెలిసికొందును.

[మాటల నందఱు పడుకొందురు. చందుడు మాత్రమెంత ప్రయత్నించినను తాళజాలక నిక్కముగా నిద్రచేయును.]

[ప్రవేశము : కృష్ణుడు కుండలో వెన్న దీసి చందునినోటిలో పెట్టును]

చందు—(వెన్నను మ్రింగుచు, నిద్రలో కలవరించును) నాకంతయు తెలియును లెమ్ము. ఊ ఊ ఇంకింత; ఇంకింత.

కమ, పద్మ—(కన్నులు తెరచిచూచి యాశ్చర్యపడెను)

చందు—ఇంకింత, నాకు తెలియును, యింకింత.

కమ, పద్మ—(గట్టిగా నవ్వుదురు)

కృష్ణుడు పరుగెత్తి పోవును. అందఱు నతని వెంబడించెదరు. చందు డితని బట్టుకొనివచ్చి యొక్క పెట్టెలో వేసి పెట్టెపై తాను కూర్చుండును.)

కమ—(రక్తాక్షితో) ఇప్పుడైనను తెలిసెనా? యెవరు దొంతనము చేయునది? నీనోటికి వెన్న నంటించినది నైతము నే మేయంటివే!

చందు—నేనుమాత్రము నిద్రించియుండిన నాపై వచ్చు చుండెనేమో!

పద్మ—అవును! చాల మేలుకొనియుంటివి. నిద్రలోననే కుండనిండ వెన్న మ్రింగితివి.

చందు—పొమ్మా. యశోదను పిలుచుకొని రమ్మా.

పద్మ—(పోయి యశోదను పిలుచుకొని వచ్చును.)

చందు—రావమ్మా! యశోదమ్మా! నీకొడుకు ప్రతిదినము మాయింటికివచ్చి వెన్న, పాలు దొంగిలించు చుండెను. ఈనాడు పట్టి పెట్టెలో వేశియున్నాను.

యశో—నాకుమారునా! మాకృష్ణునా! కల్ల.

చందు—మీకృష్ణునినే! మీచిన్నదొంగకృష్ణునే, ఏడీ? వాడెక్కడ?

యశో—ఇంటిలో నున్నాడు.

చందు—ఇంటిలో నెక్కడ నున్నాడు? ఈ పెట్టెలో నున్నాడు.

యశో—పిలుతునా? (అని 'కష్ణా' కృష్ణా' యని యరచును. ఒక మూలనుండి శ్రీకృష్ణుడు పరుగెత్తివచ్చును. అందఱు ఆశ్చర్యముతో చూచుచుందురు)

(యవనిక పడును)

4 వ రంగము : నందుని గృహము

సీ స మా లి క

యశో—నడయాఁడ నేరని బుడుత వంచన నెట్లు
నరుఁగా నింటింట తిరిగితయ్య?
శ్రీకృ—కర పాదములు లేక కావింతు చరియించు
నది యేమి యాశ్చర్య మాయె నమ్మ?
యశో—చను బాలు త్రావఁగ చాలవీ వింటింట
పా లెట్లు హరియింపఁ బరగితయ్య?
శ్రీకృ—హరియింతు బ్రహ్మాండ మట నేను క్షీరముల్
హరియించు టదియంత యరుదటమ్మ?
యశో—ఎఱుఁగవే యాటలు యిలు బాసి యెఱుఁగవు
నెఱియాట లెట్లాడ నేర్చి తన్న?
శ్రీకృ—ఆటాడ నేర్తు నే నాడింప నేర్తును
నాయాట లెఱుఁగ నీ కవునె తల్లి!
యశో—వెలివారు తిలకింప వెలిపొందు నీ వెట్లు
చోరుఁడై పొరుగిండ్లు దూరితన్న?
శ్రీకృ—మునులకు చోరుఁడై ఘనులకు చోరుఁడై
యొరులకు నే చిక్కకుందునమ్మ?
యశో—తే. గీ. దుండగంబులు చాలాయె నుండనోప
నిన్ను బంధింతు దండింతు నన్న! యింక
శ్రీకృ— ఏమి ఎఱుఁగను యేపాప మెఱుఁగనమ్మ
కరుణ గనుమమ్మ మాయమ్మ నరయుమమ్మ

యశో—తుంటరికృష్ణా! నీతుంటరితనము నావద్ద చెల్లునా? ఎక్కడికి బోయియుంటివిరా యింత సేపు? ఇంటిలో నేడు పండుగ యై

యుండ తిరిగి తిరిగి యిప్పుడిల్లు చేరితివా? ఈదినము నీపండుగ చేసెదను. చెప్పుము.

అనుబంధము 37

శ్రీకృ—అమ్మా! నేనెక్కడికినిబోవలేదు. ఇంటిలోననేయుంటిని. మరి.

యశో—మరి గిరి. నీ దొంగచేష్టలు నాకు దెలియును. మహామాయ గాడవు మొన్న పుట్టి యీదినమున కండ్లు తెరచి యెక్కడ నేర్చుకొంటివిరా?

శ్రీకృ—నామాట వినవే! నామాట సాంతముగా విని నీకే కరుణ గలిగిన విడువుము: లేకున్న నీవు వలసిన దొనర్చుము.— మన రాముడును గోపాలుడును, ఉద్ధవుడును నన్నాడుటకు రమ్మని పిలిచిరి. "నేను రాను, మాయమ్మ కొట్టును. మీరుపొండి" అని చెప్పితిని. పండుకొంటిని. లేచిచూతునుగదా? వారునన్నా తోటలో నాడించుచుండిరి. ఇందుమా దేమితప్పు నీవే చెప్పుము!

యశో—(చిఱునగవునవ్వి) ధూర్తగోపాలా! కాదు నీవు పరుండిన వాడ వెట్లాటలాడితివిరా?

శ్రీకృ—అమ్మా! నా సంగతి నీకు బాగుగా తెలియదు గాబోలు. నేను పండుకొనిన చోటనుండియే యన్ని యాటలాడెదను. అందరిని నాడించెదను. నీయట్టివారడిగిన నా కేమియు తెలియ దని యూరకుండెదను.

యశో—అయ్యా! నాచిన్నికృష్ణా! ఇంత యీడునకే యెంత నేర్చితి వయ్యా! (అని చేతిలోనిది క్రిందనుపారవైచి ముద్దాడును.)

[ ప్రవేశము: ఒక బాలకుడు ]

బాల—అమ్మా! యశోదాదేవి! (కృష్ణునిజూచి రహస్యముగ) చెప్పుదునా?

శ్రీకృ—(తలదన్ని కన్నెఱ్ఱజేయును)

బాల—నీకుమారుడు మన్నుదిని యున్నాడు. వలదని నేనెంత
చెప్పినను వినలేదు. భూమికిని వీనికి మిక్కిలి ప్రేమ యున్న
ట్లున్నది. (నిష్క్రమించును)

యశో—ఔనా కృష్ణా! తినుటకు నింటియందు పిండివంటలు లేవా?
ద్రాక్షాదిఫలములు లేవా? ఇంత నేమిటకు వైనదని మన్ను
దినెదవురా? "అంగడిలో అష్టభాగ్యము అల్లునినోట శని"
యన్నట్లున్నదే నీచర్య?

క. మన్నేటికి భక్షించెను
మన్నియము లేల నీవు మన్నింపవు నీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా! మన్నేల? మరి పదార్థము లేదే?

శ్రీకృ—అమ్మా! వీరి మాటలనా నీవు నమ్మునది? అబ్బబ్బ! యెంత
కల్లలాడుచున్నారు! భూమి నాకు ప్రియురాలు; నిజమే మన్ను
దినునంతటి వెఱ్ఱివాడనా నేను?

శ్లో. అమ్మా! మన్ను దినంగ నే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేని న్మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము జేసి నావచనముల్ దప్పైన దండింపవే."

యశో—అయిన వీరిమాట లసత్యములా!

శ్రీకృ—అసత్యములా? ఇంకను అసత్యములా? అమ్మా! వీరితో
నేనాడుకొనుటకు బోవలేదు. కావున నిట్లు చెప్పుచున్నారు.

అనుబంధము 38

యశో—అయిన నీనోరు చూపుము.

శ్రీకృ—నోరు తెరచును (విశ్వరూపమగుపడును)

యశో—(దిగ్భ్రమము నభినయించి) ఆహా! యిదేమి చిత్తభ్రాంతియో లేక మనోవికారమో ?

మ. కలయో మోహమొమాయయో యితరసంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక యున్నదాననో యశోదాదేవిగానో పర
స్థలమో బాలకుఁడెంత యీతనిముఖస్థంబై మహాలోకము
జ్జ్వలమై యుండుటకేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగన్

పరమయోగులకైనను జ్ఞానులకైనను జూడ నసాధ్యమైన రూపమును గాంచితినే ? బాలుడు, ఏమియు తెలియనివాడు. ఇట్టి కృష్ణుని ముఖమునందీ బ్రహ్మాండజాలంబు గనుపించుటాయెగా ? ఆహా! ఇది వైష్ణవ మాయయో. నాపూర్వ సుకృతఫలమో తెలియకున్నది. (బాలునిఁజూచి) కృష్ణా ! ఏమి మహిమ ?

శ్రీకృ—ఏ మున్నదమ్మా ? నీవే కండ్లు మూసికొంటివి. తెరచితివి.

యశో—అవును కృష్ణా ! నీవు మిక్కిలి సుశీలుడవు. ఇదిగో నాకు కొంచెము పని యున్నది. పోయివచ్చెదను. నీ విచ్చటనే కూర్చొని యుండుము. ఎక్కడికిని బోవలదు. ఎక్కడికైనను బోతివా ! నిన్ను బాగుగ శిక్షించెదను.

శ్రీకృ—నే నెక్కడికిని బోవనమ్మా ! నే నెక్కడికిని బోవకున్నను నన్నియు నావద్దకే వచ్చిన నెట్లు ?

యశో—వలదని యావల బంపుము. హెచ్చరిక.

(నిష్క్రమించును)

శ్రీకృ—ఈతల్లికి నేను చేయు బాలక్రీడలచేత మన మానందపరవశమైయున్నది నొక్కపరి నే నొనర్చు పరమాద్భుతకార్యముల వలన నన్నే దైవమని భావించుచున్నది. కావున నా మాయచే నామెజ్ఞానమును నశింపజేసి నన్ను పుత్రు డనియే

భాషించునట్లు చేసెద. ఆమె మనమున కొక నిర్ధారణ గలుగ కుండ చేసెదను. (నలుదిక్కులు జూచి) ఎవ్వరును లేరు. ఇచ్చట నొక క్షీరభాండ మున్నది. దీనిలోని పాలను మన సార ద్రావెదను. (అని కొంతద్రాగి భాండమునకు రంధ్రము వైచి పరుగెత్తును)

[పునః ప్రవేశము : యశోద]

యశో—ఔరా! ఏమి నాభాగ్యము. హరిబ్రహ్మాదులు సైతమెవ్వని పాదరజంబును నొందనేరక యనవరతము వేసరుచుందురో యనేకశతవత్సరంబులు వాయునిరోధమును జేసి బాదాంగుష్ఠము భూమిపై నిలిపి తపమొనర్చుపరమతాపసులైననెవ్వని సాక్షాత్కార మొందనేరక కష్టించుచుందురో, వ్రతనియమాదు లొనర్చిన పరమకర్మయోగులైన నెవ్వని సన్నిధానమును గాననేరరో, సన్నిహితయై, సహచారిణియైయున్న నా రమాదేవి యెవ్వనియాశయ మెఱుంగ కుండునో, యట్టి శ్రీ రమాపతి, నారాయణుడు నాకెంతయు గుమారుడై నా యంకపాళి శయనించి తనమాటలవలన నన్ను గృతార్థురాలి నిగాఁజేయుట నాతొలిజన్మమునఁ జేసిన తపఃఫలమే గదా? అదేమి మాయయెా కాని యెంద రెందరు మహనీయులు నీ కుమారుడు దేవదేవుఁడని బోధించినను పుత్రవాత్సల్యమే కలుగుచున్నదిగాని భక్తిరస ముద్భవింపకున్నది. కానిమ్ము. భక్తివిశేషమునధ్యానించుట లేకున్నను నాపరాత్పరునిదర్శన స్పర్శసల్లాపాదుల చేతనైన నాకుధన్యత కలుగకపోవునా? (అందిందుచూచి) ఆహా! మాచోరగోపాలుడెక్కడికి పోయి యున్నవాడో? నన్ను కనుమరిగించి యెక్కడికిబోయి యుండును? ఎంత కాచెదనన్నను మాగోపాలకృష్ణుడు నన్నే

మోసగించుచున్నవాఁడే? ఇప్పటినుండి యీ జిత్తులు టక్కులు నేర్చిన మఱింకెట్లగును? ఇఁక వీనిని దండింపకున్న విధి లేదు. (కొంచె మాలోచించి) ఆహా! యెట్లు దండింతును? నిండు తమ్మిదలశోభ నిరసించు ముదగురులు నిటలప్రాంతమున నటియింప, శారద చంద్రచంద్రికావిశద మనోహర మందహాస మధురబింబమున కొక వింతకాంతి నివ్వ, ముల్లోకంబుల గానఁజాలు వెలలేని తెలిదామరల వెలపుసొంపుల నేలి వేయి వీక్షించిన సానంద మోక్షరాజ్య మొసంగు పుండరీకాక్షము లపర పుండరీకాక్షమహిమము నగ్గడింప, పున్నమచంద్రుని విన్నాణము కన్నుదన్ను వెలలేని చెలువునించు మోము దిలకించిన వారి ధన్యులఁ జేయుచుండ, పదునాల్గు లోకంబులకైన భరియింపఁజాలు తిన్ననిబొజ్జ కదలాడుచుండ, ప్రత్యవయవంబుననుండి పొంగి, పొరలి, పైనురుకు లావణ్యసుధారసంబు కన్నులకొక పరమాద్భుతంబు నించు మా రాజగోపాలు మణిదర్పణకపోలు, సుగుణాలవాలు, అష్టమీచంద్రవిభ్రాజదళికఫాలు, నా ముద్దులబాలు నా చేతులార శిక్షింపఁజాలుదునా! (ఆలోచించి) అయ్యో! శిక్షింపకున్న నెట్లు? లాలనము చేయుటవలన ననేక దుర్గుణము లావరించును! శిక్షించిన ననేకసుగుణము లావరించునని గదా లోకానుభవము? ఏమి చేయుదమన్నను చేతులాడవు గదా! దుష్టచేష్టల నాలించి శిక్షింపవలయునని మనమున నెంతయో నిర్ధారణపరచుకొని పోవుదుగాని, దగ్గఱకువచ్చి మా వేణుగోపాలు డమ్మా యన చేతులెత్తి యేమియు దెలియనిరీతి ముఖమువంచి, నేత్రములనుండి చిన్నిచిన్ని కన్నీటి బిందువులువిడిచెనా! ఉన్న కోపమంతయు బోయి; యెక్కడలేని ప్రేమయు వెలివచ్చి నా దేహమునే మఱపించును. (క్షీరభాండ

మును జూచి) ఆహా! ఇచ్చటనున్న పాలన్నియు త్రాగిపోయి యున్నవాఁడే? ఎటులైనను నేఁడు దొరికెనా వాని శిక్షింపక మానను కృష్ణా! కృష్ణా! (నిష్క్రమణము)

[వెనుక యవనిక నెత్తగా శ్రీకృష్ణుఁడు పరుగెత్తుచుండును. యశోద వానిని వెంబడించును.]

అనుబంధము 39

యశో—(కృష్ణుని బట్టుకొని) చోరగోపాలా! ఇంక నిన్ను విడువను. పసిబాలుఁడ వని పోనిచ్చి నట్లంతయు నీపోకలు మానవు గదా? ఈ గోకులంబుననున్న బాలకులందఱు నెట్టి సుస్వభావులై యున్నవారో చూడుము. నీవెక్కడనో విలక్షణ పుత్రుఁడవు జనించితివినాకు. నిన్ను నేఁడు విడువను. నీవెవ్వరి యందును జిక్కుపడవు. ఎవ్వరికిని భయపడవు. నేఁడు చూచెద నీ చేష్టలన్నియు.

శ్రీకృ—(కన్నులు నులుపుకొనుచు) జననీ! ఇక నేనెన్నఁడును తప్పులుచేయను. ఈసారిమాత్రము నన్ను మన్నింపుము. నేనిదివరకు నొకరిని మన్నించి యెఱుగుదునుగాని మన్నింపుమని వేఁడి యెఱుగను.

యశో—ఔరా! వెన్నకృష్ణా! దొంగతనమున వెన్న నంతయు దినునప్పు డీవినయ మెక్కడికి బోయియుండును? వెన్న నంతయు భక్షించి పరుగెత్తితివా?

శ్రీకృ—అమ్మా! నేను వెన్నను భుజింపలేదు. నీవు లోపలికిపోతివి. నేను కుండ బాగుగనున్నదాయని దానిని దాకితిని. కుండ రెండుభాగములై యేటికో క్రిందపడెను. అప్పుడు నేనుదానికై వెఱగంది నీవు వచ్చి చూచిన నేమందువో యని కన్నులు మూసికొని యాలోచించుచుంటిని. బాలు రందఱువచ్చి నా నోటిలో వెన్ననిడిరి. మాయమ్మ తిట్టును. వలదని నేనెంత

చెప్పినను వినక మీ తల్లియే నిన్ను భక్షింపుమని చెప్పినది. భుజింపుమని కడు నిక్కచ్చి చేసిరి. నేను ద్రిమింగితిని. ద్రిమింగుట మాత్రము నాదితప్పా.

యశో—ఔరా బాలకా! యెన్ని విన్నాణములు నేర్చియున్నావు? ఆవెన్నను తెచ్చియిచ్చినకాని నిన్నువిడువను. లేనిచో నా వెన్నుడు వచ్చినను విడువను.

శ్రీకృ—జననీ ఆ నవనీతము కడుదుర్లభమే? అనుభవించిన వారికి మాత్రము సులభము. ధనికులకు మిక్కిలి కష్టము. (అని యామెనుండి తప్పించుకొని దూరము పోయి నిలుచును)

యశో—వీని మాటలకు నవ్వుదునా? లేక కోపగింతునా? ఏమో బాలుడని ముద్దొనర్చితినా, తుంటరి పనుల జేయును దండింతునంటినా మనసు పుట్టదు. ఏమిచేయుదు?

సీ. బాలుఁ డీతండని భావింతు నందునా?
యే పెద్దలును నేర రీక్రమంబు
భయ మెఱుంగుటకునై భయపెట్ట నెంతునా?
కలిగి లేకొక్కఁడుగాని లేడు
దండించి జ్ఞానంబుఁ దాల్పింతు నందునా
తనుదానయై బుద్ధిఁ దప్పకుండు
ఏమెఱుఁగక యింటినే యుండు నందునా
చొచ్చి చూడని దొక్కచోటులేదు
గీ. తన్ను నెవ్వారైనఁ దలపోయఁ బారెడు
నోజలేదు భీతి యొక టెఱుఁగఁడు
ఎలమ నూరకుండఁ డెకసెక్కముల నాడు
పట్టి శాస్తి చేయుభంగి యెట్లు?
(అని బాలుని వెంబడించి వానిని బట్టుకొని)

యశో—ఓహో! వీరు శ్రీకృష్ణులో!

క. నీ రెవ్వరు శ్రీకృష్ణులు
గారా యెన్నఁడును వెన్న కానరఁట గదా?
చోరత్వం బించుకయును
నేర రఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే?

కృష్ణా! చిక్కితివి. ఇంకెందు పోగలవు? యెక్కడచూచినను దిరుగుచుందువు. ఏగుణము నీయందు లేదు! నీళ్ళని వెఱవవు. కొండ యని భయపడవు.

క. ఎక్కడనైనను దిరిగెద
వొక్కయెడన్ గుణము గలిగియుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జక్కఁగఁబోయెదవు పెక్కుజాడలఁ బుత్రా!

(స్వగతము) ఈ ముద్దుబాలుని గొట్టుటకు మనసురాదు. కావున గట్టివైచెదను. (త్రాడు తెచ్చి కట్టుటకై యెన్నిమారులు బొజ్జకుచుట్టిన నది చాలకపోవుటజూచి) ఆహా! ఇదియేమి చిత్రము? ఈకుమారుని చిఱుతబొజ్జ కెంత పెద్దత్రాడు చుట్టిననుజాలకయున్నది గదా? ఈబొజ్జ లోకమున నెందును గాంచని బొజ్జగా నున్నదే? కృష్ణా! కృష్ణా! కట్టుపడెదవా? లేదా?

శ్రీకృ—జననీ! నేను కట్టుపడవలయునా? నన్ను సులభముగా కట్టి వేయు మార్గము లనేకము లున్నవి. నీవు పుత్త్రుడవని యింక ప్రేమించి యడిగిన నీకును గొంత కట్టుపడెదను.

యశో—(బాలుని రోటికి గట్టి) ఇంకెక్కడకు పోవగలవు? పడి యుండు మిందు) (నిష్క్రమించును)

శ్రీకృ—లోకమున నన్ను గట్టివేయజాలు భక్తి యొక్కటియున్న సులభముగా గట్టుపడెదను. అయినను నీబంధనమువలన నాకై వేచియున్న నాభక్తుల బంధనముల విడిపించెదగాక,

(అని రోటి నీడ్చుకొనుచు రెం డర్జున వృక్షముల నడుమ పోవును. గొప్పధ్వనితో నావృక్షములు కూలి వానినుండి నలకూబర మణిగ్రీవులను నిరువురు గంధర్వులు వెడలివచ్చి కృష్ణుని స్తోత్రము జేయుదురు.)

అనుబంధము 40

నల—దేవా! కృతార్థులమైతిమి. నీదయావలోకనమున మాకు శాపవిముక్తి గలిగెను. నేను నలకూబరు డనువాడను. ఇతడు మణిగ్రీవు డనువాడు నాతమ్ముడు. మే మిరువురము కుబేరుని నందనులము. ఒకనాడు కాంతలతో గూడి యాకాశ గంగ యందు జలక్రీడలు సలుపుచుండ నారదమహాసీంద్రు డచ్చోటికి వచ్చి తన్ను సరకుసేయకయున్న మమ్ము భూలోకమున నర్జునతరువులై పుట్టు డని శపించెను. ఆ శాపమువలన మే మింతవరకు బంధమోక్షము గానకయుండి యుంటిమి. నీవల్ల మోక్షము నొందితిమి.

మణి—మేము తెలివి దెచ్చుకొని యా తపోధనుని పాదములపై బడి మన్నింప వేడికొని నా పరమదయాళువు ద్వాపరయుగమున విష్ణుమూర్తి కృష్ణావతారమెత్తి మిమ్ముల బడవైచును. అప్పుడు మీకు శాపవిముక్తి గలుగునని యానతిచ్చె. మేమిక పోయివచ్చెదము. (అని నమస్కరింతురు.)

శ్రీకృ—గంధర్వులారా! మీకు శుభంబగుగాక. పోయిరండు. ఎప్పుడును ధనమదాంధులై పూజ్యులగువారి నవమానింపకుడు. తెలివి దెచ్చుకొని మనుడు.

(నిష్క్రమణము)

శ్రీ

# కృష్ణలీలనాటకము



## చతుర్థాంకము



### 1 వ రంగము—బృందావన సమీపారణ్యము

[ప్రవేశము : శ్రీకృష్ణుడు పాడుచు]

శ్రీకృ—చంద్రోదయమగుచువచ్చె. అల్లదేచంద్రుఁడుపూర్వాద్రిపై వెలుగొందు చున్నవాఁడు. ఆహా! చకోరములకు సంతసముఁ గలిగించి కువలయంబులకును కువలయమునకును పురులేని యాహ్లాదరసము నించు నీ చంద్రుఁ డెంత యొప్పుచున్నవాఁడు?

సీ. విటసేనపయి దండు వెడలెడు వలఱేని
  కొమరారు రథహేమకుంభ మనఁగ
కాముకధృతివల్లికలు త్రెంప నెత్తిన
  శంబరాంతకుచేతి చక్రమనఁగ
మారుండు విరహాళిమానాటవులఁ గాల్పఁ
  గూర్చిన నిప్పుల కుప్పయనఁగ
విరహిణీమృగముల వేటాడ మనసుండు
  తెచ్చిన మోహనదీప మనఁగ

ఆ. వె. వింతనునుపు గలిగి, వృత్తమై, యరుణమై
కాంతితోఁ జకోరగణము లుబ్బ
పొడమె నుదయగిరిని బొలుపారఁగా చంద్ర
మండలంబు గగనమండలమున.
ఇట్టి చల్లనివేళ వీనులకు విందుగ వేణుగానం బొనర్చెదగాక.
(అని మురళిగానము చేయును)
(లోపల పాట 41 అనుబంధములో పల్లవి మాత్రము)
అల్లదెగోపకాంతలువచ్చుచున్నట్లున్నది. వీరికిగొంచె ముప దేశింపవలసి యున్నది. మరుగుననుండి వీరిచర్యల దిలకించి వీరి పూర్వజన్మజ్ఞానమున దెలివిని కలుగునట్లు చేసెదను.
(అని మఱుగున డాగికొనును)

[ప్రవేశము : గోపికలు పాడుచు]

అనుబంధము 42

1 గోపిక—ఆహా మనమెంత మోసపోతిమి ? యశోద గారాబు తనయు డంచును, గోపాలబాలుడనుచును, నవనీత చోరు డనుచును, తుంటరికృష్ణుండనుచును నెంచి, మక్కువలునించి, యెనలేని మోహం మంకురించి, యశోదాదేవితోడ నారాజ గోపాలుని దుడుకుతనంబుల వచించి బేలల మైతిమిగదా ? ఈ బృందావనమున నాబృందారకమూర్తి, సనకసనందనాది వందితుడు, ముకుందుడు, నందనందనుడు, మనలను కృతార్థల జేయుటకై భూలోకమునకు విచ్చేసియుండుటకు తెలియ జాలక పోయితిమే ?

2 గోపిక—అమ్మా ! మన యశోదాదేవిదేభాగ్యము. పురాణపురుషుడగు నాకృష్ణమూర్తి నందనుడై జనింప గలుగుట వలన నామెతపఫల మెంత కొనిర్యాడ్డ ఫలస్సియున్నది.

3 గోపిక—అయ్యో ? ఇంతదూరము వచ్చియు మన మనోరథము లీడేఱవయ్యెగదా ? మన కేల యట్టిప్రాప్తి లభించును ? వేదములకైన దొరకక, తపోమార్గమునకు జిక్కక, యోగాభ్యాసమునకు దక్కక, తనంత వెలుగొందు నా పరమాత్మ, పాపచిత్తులమైన మనకు దర్శన మిచ్చునా ?

1 గోపిక—ఓమల్లియలారా ! మీ రేమైన మాకృష్ణుని గాంచితిరా ?

ఉ. నల్లనివాఁడు, పద్మనయంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు, మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడుమోమువాఁ డొకడు, చెల్వలమానధనంబు తెచ్చెనో
మల్లియలార ! మీపొదలమాటున లేడుగదమ్మ చెప్పరే.

4 గోపిక—ఓపాటలీతరువులారా ! మాకందములారా ! మీ రైన మా కృష్ణుని జూపరాదా ?

2 గోపి—అయ్యో ! ఈ కాంతారమున నెంత వెదకిన నేమి ? ఆకఠిన హృదయుడు మనకు జిక్కునే ? ఆ ధూర్తగోపాలుని చర్యలు మన మెఱుంగమా ? వాని కిట్టి మెత్తని మార్గములకు గరుణ వచ్చునా ? మన దృఢభక్తి యనెడి త్రాళ్ళచే బిగించి, మన మనస్సనెడి చెరసాలయందుంచి, వైరాగ్యమనెడి బేడియలు తగిలించినగదా మనకు జిక్కును. లేకున్న నాదొంగ యనగ నేమి ? మనకు దొరకు టనగ నేమి ? (అని కొంచెము ముందుకు బోయి) ఆహా ! అతని పాదము లిందు కనిపించుచున్నవి. ఈ చరణములే కదా భవతరణములు !

సీ. ఈచరణంబులే యిందునిభానన !
సనకాదిమునియోగసరణి నొప్పు
ఈపాదతలములే యెలనాగ ! శ్రుతివధూ
సీమంతవీధులఁ జెన్నుమిగులు;

ఈపదాబ్జంబులే యిభకులోత్తమయాన!
పాలేటిరాచూలి పట్టుగొమ్మ;
ఈ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ!
మోక్షకాంతామనోమోహనంబు;

ఆ. వె. లీయదుగులరజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రమ్మలార! యిట్టి యమలపదంబులఁ
గాంచు భాగ్య మింకఁ గలదొ లేదొ.

ఆహా! ఓధరిత్రీదేవి! యేమి పుణ్యము చేసితివో గదా?

క. కిటిరైమె కౌఁగిటఁ జేర్చెను
వటువై నర్థిల్లఁ గొలిచె, వరకృష్ణుండై
యిటు పదచిహ్నము లిడె నేఁ
డటుబాముస నేమి నోచితమ్మ ధరిత్రీ!

గోపి—ఎటులైన నా హరిని భక్తిమార్గముననే కట్టివేయవలయును. కావున నాతని నింక ధ్యానింతము. అప్పు డతడే యిందు రాగలడు. (అని అందరు కండ్లుమూసికొని ధ్యానింతురు)

అనుబంధము 43

[ప్రవేశము : శ్రీకృష్ణుడు]

శ్రీకృ — గోపకాంతలారా! లెండు. ఏమి నేడు మీరందఱు మహామునులై యున్నారు?

గోపి—కృష్ణా! కృష్ణా! దొరకితివా? ఇంకెందు బోగలవు? (అని చేతులను కొందఱు, పాదములను వస్త్రమును గొందరు పట్టుకొందురు.

శ్రీకృ—వల్లవాంగనలారా! నిమ్మళింపుడు, కూరుచుండుడు (అనగా నందరు కృష్ణునివిడిచి చుఱకమునవిఖుచుందు) హరిణేక్షణలారా!

మీ కందఱకు సేమమా? మీమందకు సౌఖ్యమా? ఇది సింహశార్దూలాది ఘోరమృగంబులు సంచరించెడి మహా వనమే! ఇటకు మీ రొంటిపాటున రావచ్చునా? అందును, రాత్రికాలమున నబలలిల్లు విడిచివచ్చుట మహాపరాధమగును కదా! ఇంతవరకు మీతలిదండ్రు లెంత వేసరు చుందురో? మీ యన్నదమ్ము లెంత వెదకుచుందురో? బావమఱదు లెంత భయపడుచుందురో? వారికి జెప్పియైనను వచ్చితిరా?

శా. 'మేలామీకు? భయంబు పుట్టదుగదా మీమందకున్? సింహ శా ర్దూలానేకపముఖ్యము ల్దిరిగెడిన్ దూరంబు లే తెంతురే? యేలా వచ్చితి రీ నిశాసమయమం! దీరీతి రావచ్చునే! చాలున్ జాలు లతాంగులార? చనుఁడీ సంప్రీతితో మందకున్.

1 గోపి—ప్రాణవల్లభా! మాయిండ్ల నందఱికిని సేమమే. ఇచ్చటికి వచ్చుట యేలయని లోకారాధ్యుడ వగు నీవే యడిగిన మే మేమి చెప్పగలవారము? నీదివ్యశరీర సంస్పర్శనమువల నను, నీయనవరత క్రీడావినోద సుఖమువలనను, నీసురత సుఖమువలనను, నీయభినవ సరససల్లాప సౌఖ్యమువలనను, నీయధరామృత పానమువలనను, ధన్య లగుటకునై నీమురళీ గానము వినినంత నే పతుల మాటాడింపక, సుతుల నాదరిం పక, బావమఱదుల నాశింపక, నీసన్నిధికి వచ్చియున్నారము. త్రాహియని శరణొంది యున్నారము. ఈవిరహతాపమును సహింప జాలము.

శ్రీకృ—ఇందుముఖులారా! ఇదియా ధర్మము? ఇదియా కులాచారము? ఇదియా మీకును మాకును నాచరణీయము? ఇన్ని దినములు నా సేవాభాగ్యము మీకు గలిగియుండియు జ్ఞానము లభింప

దయ్యోగా ? అయ్యో ! బంధువుల కందటికిని దలవంపులుగా జారిణులై జారభోగము నభిలషించి యిందు వత్తురే ?

చ. ఇలువరి సున్న జేసి హృదయేశుల సిగ్గులఁ జంపి యత్త మా
మల నెటియించి సోదరుల మానము పోవఁగఁ గొట్టి తల్లి దం
డ్రులరుచి మాన్చి బంధులకు రోతయొనర్చుచు జారవాంఛలన్
వలతురె సత్కులాంగనలు వత్తురె లోకులు చూచి మెత్తురే.

అకటా ! జారిణీసంభోగమువలన నేమైన మీకు రుచికల దని యెంచితిరా ?

సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన ప్రాణంబుపై వచ్చు
రా జెఱింగిన మనరామి గల్గు
మామ యెఱింగిన మమతయే చెడిపోవు
తగవరి యెఱిఁగిన దప్పు గల్గు
తలిదండ్రు లెఱిఁగినఁ దలయెత్తకుందురు
వదినెగా రెఱిఁగిన వాసిపోవు
ఆత్మజు లెఱిఁగిన నాదరింపక యుంద్రు
బంధువు లెఱిఁగిన బయసి చెడును

ఆ. వె. ఇతరు లెఱిఁగిరేని నెంతయుఁ జులకగాఁ
జూతు రిందు నందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారతనము సుఖమె చానలార !

లేక మీరు పొరబాటున వచ్చితిరా ? ఇది యమునానదీతీర పల్లవిత రమ్య కాంతారము గాని వ్రేపల్లెయందలి మీ కుటీరములు గావు చక్కగ నాలోచింపుడు.

2 గోపి.—దేవా ! ఈ తుచ్ఛమగు దేహసౌఖ్యమును గోరి యిందు వచ్చితిమని యెంచితివా ? ఎంత పొరబడితివి ?

శ్రీకృ—అటులైన మీరు వచించిన వాక్యములయందుగల 'శరీర స్పర్శన'మను పదమునకు 'కామబాధ'యను పదమునకును 'నీవిరహాగ్నిని సహింపక'యను పదమునకును, 'సురత'మను పదమునకును, 'అధరామృత'మను పదమునకును భావమేమి?

2 గోపి—సర్వేశ్వరా! శబ్దబ్రహ్మవై, సకలవాక్య జాలంబులకర్థస్వరూపుడవై యున్న నీ వెఱుంగనియర్థమనర్థముగలదే? అయినను మామనసరయగోరి యడిగెదవుగాక. దివ్యశరీర స్పర్శనమనగా వాచామగోచరమై, సచ్చిదానందగుణమగు నీ తేజమునందు మేమను తేజమును లయ మొనర్పుమని మాయభిప్రాయము. ఇక కామబాధ యనగాదుచ్ఛమగు మన్మథబాధ యని మాతాత్పర్యముకాదు. కామక్రోధాదిగుణములనెడి శత్రుబాధను దొలగించి మానసశుద్ధిగలిగించి, జ్ఞానముదయింపజేసి, మోక్షసుఖమిమ్మని మా యభిప్రాయము. మఱియు నీ విరహతాపమనగా జ్ఞానానందమయుండ వగు నీయందవిద్యచే నారోపింపబడిన యజ్ఞాన సత్యదుఃఖములచే గూడియుండు జీవత్వము. నీ విరహమున బ్రాపించిన దుఃఖముగావున నట్టివిరహమును పోగొట్టి సచ్చిదానందమూర్తియగు నీయందేకాకారముగ పరిణమింపజేయుమని మా యభిప్రాయము. సురత మనగా నీయందు భక్తిమైక్రీడించుచు ప్రత్యగాత్మ పరమాత్మల కభేదము కల్పింపుమని యాశయము. అధరామృతమన సర్వసుఖములను ధిక్కరించుచు మోక్షపద సుఖ మిమ్మని నిన్ను వేడు వారము.

3 గోపి—లక్ష్మీరమణా! మే మనవరతము నీయందేదృష్టిగలిగి భవద్భక్త్యధీనమానసలమై, నిన్ను సేవించుటకై వాంఛించి యున్నారము. మాకు నీ భక్తియే మోక్షదాయకమని నమ్మియున్నారము. పతిపుత్రాది సంసారము నించుకమైనగోరము. కావున

ననన్యగతి కలమగు మాకు దరుణోపాయమును వచించి కృతార్థులను చేయుమని వేడుచున్నారము.

శ్రీకృ—గోపికలారా! మీయాశయము మిక్కిలి సమంజసము. మీరు నన్ను సేవించుటకై, నావలన నధ్యాత్మవిద్యోపదేశము నొందుటకై జనించిన మహామునులుగాని నిక్కంపుగోపకామినులు కారు. కావుననే మీరిట్టి సుజ్ఞానమును బొందియున్నారు. అయినను నెట్టివేదాంత జ్ఞానమును కలిగియున్నను లోకమర్యాదను విడువ బాడిగాదు. లోకమున గొందరు మూఢాత్ములు మనలను జూచి సందేహింతురు. మఱియు నాయందు వ్యభిచారదోషము నారోపించి, నన్ను పరిపరి నిందింతురు. వారు పరమార్థము నెఱుంగజాలరు. నాయందు భక్తిభావనచే వివేకజ్ఞాన మూనినవారు కాములైననేమి? కాముకులైననేమి? వారికి ముక్తినొసంగుట నాకెంతయు గర్తవ్యముగదా? కావున మీరును లోకనిందకు లోనుగాక, బాహ్యప్రపంచమున సంసారులవలె నటించుచు, నంతమందు నన్ను ధ్యానించు జ్ఞాన మవలంభింపుడు. మీకు ముక్తి కలుగును. ఇదియుంగాక భామలకు పతికంటె వేఱొక్క దైవము కలదే? ఆ పతినే నారూపునిగ భావించి పతికి పరిచర్యల జేయుచు నప్పుడప్పుడు నన్ను దిలకించి జ్ఞానంబు నొందుచు కాలము గడపి యంతమందు మోక్షము నొందుడు.

చ. వనితలు నన్నుఁగోరి యిట వచ్చితి రింత గొఱంత లేదు మే
లోనరె సమస్తజంతువులు నుర్వి ప్రియంబులు గావె నాకునై
నను నిలువంగఁబోలదు సనాతనధర్మము లాడువారికిన్
పెనిమిటులన్ భజించుటలు పెద్దలు చెప్పుచునుందు రెల్లెడన్.

క. నడవడి కొంఱగాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ, బామరుఁడైనన్
జడుఁడైన, రోగియైనను
విడువక పతిసేవఁ జేయ వెలఁదికిఁ దగదే.

నాదర్శనధ్యానాకర్ణనములవలననే మీకుముక్తిలభింపగలదు.

క. ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నాతలంపు గలిగినఁ జాలున్
పూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుఁడు మరలి మందిరములకున్.

3 గోపిక—

మ. ఘనలక్ష్మీయుతమై, మహాశుభదమై, కామాదివిధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతర తపస్సంతప్తపున్నాగ జీ
వనమై యొప్పెడు నీకథామృతము ద్రావం గల్గునే భూరి పా
వనరూఢత్వము లేనివారికి రమానారీమనోహారకా!

చెలులారా! రెండు ధన్యలమైతిమి. ఈశరత్కాలపు వెన్నెలయం దీమాధవుని నింత యారాధింతము.

(అని జటానాట్యము జేయుదురు)

(మెల్లగ యవనిక పడును)

---

## చతుర్థాంకము—2 వ రంగము

## మధురాపురి—కంసుని యాస్థానము

[కంసరాజు, మంత్రులు, లంబకర్ణుడు, తామ్రచూడుడు, తాళభుజుడు, కుంభనాసుడును అక్రూరుడు నుందురు]

కంస—మంత్రులారా! ఇప్పుడున్న యుదంత మంతయు దెలిసెను కదా? నాచేసిన యుద్యమము లన్నియు నిష్ఫలములయ్యె.

మా యోపాయము లన్నియు వమ్మయ్యె. అయిన నొక్క దానికై యూరట జెందవలసి యున్నది. నాశాత్రవు డెందో యవిదిత నామధేయుడై, మదీయ దృష్టిపథ బంధం ఆడక యిదివఱకు దప్పించుకొని తిరుగుచుండె. అట్టివా డిప్పుడు కట్టెడి యాదవగోపాలు డని తెలియుట మిక్కిలి మాకు సహకారిగదా? అందుకై నేను దీర్ఘాలోచన మొనరించి, యెటులైనను వాని నిటకు రప్పించు నుపాయంబు వెదకించుటకు వచ్చినతోడనే వాని నస్మదీయకృపాణధారచే నేనే ద్రుంపదింప దలచి యున్నాను. ఈయుపాయ మపాయమా నిరపాయకరమా యనుట నాలోచింప మీమీయభిప్రాయముల నొసగవలయు. లంబకర్ణా! నీవేమందువు?

లంబ—దేవా! సర్వజ్ఞులు మీకు దెలియనివిషయము గలదె? అయినను దేవరవారు నాఅభిప్రాయము మడుగుట నన్నుగృతార్థుని జేయదలచికాని వేఱుకాదు. ఇప్పుడు మనమేల వానిని బిలిపింపవలయు? మనకు శత్రుడైనవాడు ద్వేషమవలంబించి దాని సాధించుటకై మనయొద్దకే వచ్చును. అప్పుడు వంటయింటి కుందేటిని జేత నలిమిన ట్లవలీలగ వానిని ద్రుంతము. దీనికై మనమేల ప్రయాస పడవలయు!

కంస—ఇదియు నొకమార్గమే, తామ్రచూడా! నీయభిప్రాయమేమి?

తామ—స్వామీ! నాఅభిప్రాయ మేమున్నది? ఊరక నన్నుపుడు నేబోయి సమయము వేచి వానిని సంహరించి వచ్చెదను.

కంస—ఉండనిమ్ము కాళభుజా! నీయాశయ మేమి?

కాళ—మన కేల యాలోచన? నిశ్శంకముగ రాజ్యమును పాలించు చుందము. బాలుడేమి, మనకు శత్రువనంగనేమి? వాడు మన కే మెగ్గొనర్చి యున్నాడు?

కంస—నీది ధీరమతము కాదు. కుంభనాసా! నీవేమందువు!

కుంభ—నాకు జూడ మనస్సై వాని నిందు బిలిపించి చంపిననుసరియే. లేక వాడే వచ్చినతఱువాత సంహరించినను సరియే. నీకేది సమాధానమో నాకు నదియే సమాధానము.

కంస—సమంజసము. అక్రూరా! నీవీ తొలిజామున బయనమై బృందావనమున కరిగి, యిచ్చోట నేనొక ధనుర్యాగమును జేయనెంచి యున్నాననియు, నందులకేయాగోపాలుని నిందు రాగోరితి ననియు జెప్పి వానిని దోడ్కొ-నిరమ్ము.

అక్రూరు—కంస రాజేంద్రా! కొంచెము దీర్ఘాలోచన మొనర్పుము. ఈ కార్యము మిక్కి-లి ఘోరము; మహాపాపకరము. పాపకర మొక్క-టియేగాదు. బంధుహింసా కరము. ఆ గోపాలమూర్తి నీచే వధింప బడువాడు కాడు. అత డాద్యంతశూన్యుడు; ఆదినారాయణుడు; భక్తిభావమున నతనిని శరణొందితివేని నిన్ను క్షమింప గలడు. అతనియెడ ద్వేషమూని యూరక నశింపకుము. ఈ ధనుర్యాగవ్యాజమున నీ వతనిని బిలిపించినను దీనితత్త్వము నత డెఱుగజాలడా? మృత్యువును బేరంటమునకు బిలిచినట్లతనినేల యిందు పిలిపించెదవు? మానుము ఈదురాలోచనను వదలుము.

సీ. ప్రళయకాలాభీల పటువహ్నికీలలఁ
జేరబిల్చెడు బుద్ధిదూరుఁ డెవఁడు?
ప్రాణానిలగ్రాహ ప్రౌఢమృత్యువు నింట
వసియింపరమ్మను పంద యెవఁడు?
గిరిగహ్వరావుప్త వర కేసరిని లేపి
యెనయ బిల్చువివేకహీనుఁ డెవఁడు?
లీలానుసంచర త్కా-లాహిశయ్యపైఁ
బవళింపు మనుమూర్ఖభావుఁ డెవఁడు?

గీ. తన్ను హరియింప సమకట్టియున్నవాని,
ఘోరయమరూపమున తన్ను గోరువాని,
వికటశత్రువు పిలువ నీ వొకఁడువప్ప
కలరు యెవరైన నీ భూమి కంసరాజ!

కంస—ఛీ పలుగాకీ! కన్ను మిన్నెఱుంగవా! నాయెదుటనా నిర్భయముగ నవాచ్యముల బలుకుచున్నాడవు అధికప్రసంగీ! నిన్ను కార్యాకార్యముల నేను విచారించితినా? విధించిన కార్యము నీతలపై నున్నది. నాశాసనము నీకు దెలియును కదా! నీపీకార్యము నొనరింపవలయుననుటయొకటి; యముని సన్నిధి కేగవలయుననుట మరియొకటి. ఈరెంటిలో నొకటి నీకు దప్పినది కాదు? పొమ్మిచ్చటనుండి. తేపు సాయంసమ యమున కా బలరామ కృష్ణుల నా కప్పగింపనేవలయు.

మ. అరుదాయెన్ దగ మూఢచిత్త! భవదీయాపారపాండిత్య మీ
ధరణిన్ బాలుని, శక్తిదూరుని నిరాధారాత్మునిన్, హీనునిన్
వరవీరుం డని ధీరుఁ డంగని రణప్రావీణ్యుఁ డంచెంచెదో
ఖరఖడ్గాంచితధార ద్రుంపనె మహాకష్టంబె దుష్టాత్మకా!
ఎంతశత్రువైనను వా డొకడేకదా యుండునది?

అక్రూ—రాజేంద్రా! శాత్రవు డొకడైన నేమి? అతడు త్రిలోక వీరుఁడు. పూతనను వధియించెనే! కృష్ణు డొక్కడేకదా యుండెను.

సీ. ఘనరూప పూతన చనుబాలు గ్రోలుచు
నుర్విపైఁ గూల్చె తానొకఁడె కాఁడె
అల తృణావర్తుని నవనిపైఁ బొలియించె
నొప్పార నాబాలుఁ డొకఁడె కాఁడె?

ప్రకటబాహాబల శకటాసురునిఁ గూల్చె
నురుశక్తి గోపాలుఁడొకఁడె కాఁడె
విపులశౌర్యవిభాను వృషభాసురునిఘోర
నొక్కటబరిమార్చె నొకఁడె

సీ. ధేనుకాసురుఁ గడతేర్చి, కాననాగ్ని
మ్రింగనేర్చెను, కాళియుపొంగునార్చె,
నొక్కఁడేకాడె శ్రీకృష్ణుఁ డొక్కఁడంచుఁ
బేలవలదింక నీపాలి మృత్యువతఁడు.

రాజునకు జేటు సంభవించెడుతఱి దాసులు తమ యభిప్రాయముల వెల్లడింపకుండుట చెప్పరాని యధర్మమగుఁ గావున నింత వచించితి. నీవు పూతనను బంపి యేఫలమును సాధించితివి? తృణావర్త శకటాసులనూఱ్ఱాల్పి యేలాభము నొందితివి? అఘాసుర, ధేనుకాసుర, గార్ధభాసురులను నీ మంత్రుల నా కృష్ణునిమీద బంపి యేపురుషార్థమును సాధించితివి? వారితో సాధింపని కార్యసిద్ధిని దీన సాధించెదవుగాబోలు? వానికంటె నాగోవిందుని నిందు బిలిపించుటయం దించుక విశేషము కలదు. అప్పుడు కార్యవైఫల్య మొక్కటిమాత్రము లభించుచుండెను. నేఁడు కార్యనాశనమునకు జోడాత్మనాశనము లభింపగలదు. నేనేమి చేయుదును? అవశ్యము పోయెదను. రాజాజ్ఞనుమీరి స్వామిద్రోహమున కొడిగట్టజాలను.ముదలయైన వెళ్ళివచ్చెదను.

కంస—(మహాకోపముతో) ఓరీ! దాసుల వలన నీతి నేర్చుకొనవలయునా? ఆబాలుని జంపుటకుముందు నిన్నుఁజంపెదను. మారాడితివా చచ్చితివింక క్షమాపణమువేడినసరి లేకున్న నీఖడ్గమున—(అని ఖడ్గమెత్తును)

అక్రూ—నిన్నా నేను శరణొందునది! బాలఘాతకుడవై, యన్యాయ తత్పరుడవై గోబ్రాహ్మణ హింసకుండవై, పరమపాతకివై యున్న నిన్ను క్షమాపణ వేడికొనిన తత్ఫల మేమైన లభింప గలదే? సర్వలోక శరణ్యుడగు నా గోవిందుని శరణొంది దుర్లభమగు మోక్షపదవి నొందెదగాక, నీ వింద్రుడవు చంద్రుడవని యెల్ల వేళల స్తోత్రముచేయు నీ మంత్రులమాటలు నీకు పథ్యములును, నీతియుక్తములునా? కానిమ్ము; ఇదె పోయెద, నీవెత్తిన బాహుదండము, నేనిక్కంపు విష్ణుభక్తుడ నేని యట్లె యొక యామము నిల్చుగాక, రాజద్రోహము రాకుండ నీయుప్పు దినినందుకై నీపంపుచేయువాడ.

(యవనిక పడును)

---

చతుర్థాంకము—3 వ రంగము

మధురాపట్టణము—నిర్బంధగృహము

[దేవకీ వసుదేవు లుందురు]

దేవ—ఎన్నఁడు నా నందనునిఁగాంతును? ఎన్నడు నా ముద్దులకృష్ణ య్యను దిలకింతును! ఎన్నఁడు నాచింతల తుదిగాంతును? ఆ వ్రేపల్లెయందు శుక్లపక్షచంద్రకళరీతి దినదినము వృద్ధి గాంచు నా కుమారుని నొక్కతూరి గాంచవలయు నన్న సాధ్యముగాక యున్నదిగదా?

సీ. లేవెన్నెలలరేని లీలల హరియించు
సుకుమారు చిఱునవ్వుఁ జూచు టెపుడొ
సమ్మోద మలరింప నమ్మా! యనుచు బిల్చు
తనరారుపల్కుల వినుట యెపుడొ

చిత్త మూసలగొల్ప నెత్తికొమ్మని చేతు
లెత్తగా మదిని హర్షించు టెపుడొ
అందందు చనుదెంచి చిందులు ద్రొక్కుచు
గొమరుండు గోర్కుల గోరు టెపుడొ

గీ. ఆటలాడుచుం జేర ముద్దాడు టెపుడొ
చెలఁగి తొడపైన నిదురింపఁగలుగు టెపుడొ
కనులు తనియంగ మాకృష్ణుఁగాంచు టెపుడొ
అవని నాజన్మ సార్థకంబగుట యెపుడొ.

చ. పలికిరి నారదాదిముని భాగవతుల్ హరి కృష్ణనాముఁడై
కలిమికి ధాముఁడై వెలిగె కాంచనచేలుఁడు గోకులంబునన్
కలికిరొ నీసుతుం డనుచు కాంతులు దీరు నటంచు సజ్జనుల్
చెలగుదు రంచు నయ్యది విచిత్రపు సంభ్రమమో, వినోదమో,

మ. ఘనచిత్సత్యవభాసమై, శ్రుతిచయాగమ్యార్థమై, శుద్ధమై,
అనిరూప్యంబునునై, యనూహ్యచరమై యానందరూపాఢ్యమై
సనకాదిస్థిరమానసాబ్జయుతమై, సాక్షాత్పరబ్రహ్మనా
తనయుండై జనించెనార యిల మద్భాగ్యంబు సామాన్యమే.

చ. కనుల ముదంబు పెంచి తనుకాంతుల పద్మము నించి యెల్లెడన్
మనమున ప్రేమ ముంచి బలుపల్కుల మమ్ముల పల్కరించిమ
మ్మనువుగ నాదరించి మణిహారరుచు ల్వెలిగించి మించు మిం
చినగతి కానడాయె నిఁకచిన్ని కుమారునిఁ గాంచు టెన్నడో.

మ. మము నెందైనఁ దలంచునో తలఁపడో, మాయొద్ద కేతెంచునో
ప్రముదావిర్భవవేళఁ దా మరచెనో, భావించెనో, యెంచఁడో
కమలానాథుఁడు తల్లిదండ్రులఁ గనన్ గాంక్షించునో కోరఁడో
కమలాక్షుం డిటు చేర గల్గెడినొ భాగ్యంబెట్లు రాజిల్లునో,

శా. కారాగారనివాస మోర్చితి, మహాకష్టంబు లే నోర్చితిన్
క్రూరంబౌ సుతహాని కోర్చితి, సుదగ్రోచ్ఛిన్న కౌమార కా
న్తారావంబును నోర్చితిన్, తనుజరక్తాసార మే నోర్చితిన్
ఓరాజీవదళాక్షు! ని న్విడుచు టే నోర్వంత లే నక్కటా!

గోకుల బృందావనమున సుఖముగ నా నందను డున్నవాడని యించుక మనస్సంతోషము గలిగియుంటినిగదా! ఆ సౌఖ్య మంతయు నేడు వమ్మాయ్యెనే? నిన్న రాజాస్థానమునధనుర్యజ్ఞ మనెడియొకమిషను గల్పించి యాగోపాలుని గొనితెచ్చుటకై యక్రూరుని బంపునటుల నా దురితాలవాలుడగు కంసుడు నిర్ధారించినాడని యిపుడు గదా వింటిని? అకటా! దీని కేమి సేయుదు? పుట్టిన క్షణముననే నిండువెన్నెలరేని చందము నించు నా నందనుని మరల జూచు భాగ్యము లేనట్లయ్యెగా కట్టా! దీని కా యక్రూరు డెట్లు సమ్మతించెను? వివరము దెలిసికొనుటకైన నవకాశము లేకపోయెనే? పరమభక్తుడై, యతి సుస్వభావుడై యున్న అక్రూరుని కిట్టిబుద్ధిపుట్టినన్న నిం కెవ్వరిని నమ్మవలయు? అయ్యో! చెడుగు సంభవించు కాలమున నెట్టి వారి కెట్టిబుద్ధి పుట్టునో యెవ్వ రెఱుంగుదురు?

వసు — అకటా! తరుణీ! నీకుమారుని సందర్శించునభిలాషమున నింత వంత కుందెదవుగాక. భవతారకుడై నపరమపురుషుని కుమారునిగా బడసినందున భవ్యమోక్షపదవి కెదురుచూచున్నార మని తలంపవుగదా? కారాగారవాసమే యుండుగాక! అవాచ్యకష్టము లేకలుగుగాక! చిత్రహింస లేసంభవించుగాక, నిరంతర యోగిజనమానస కమలకర్ణికా విరాజమానమై నిత్యానందాఖండ పరంజ్యోతిస్స్వరూపమై లక్ష్మీమందిర మైన సత్యప్రకాశమును గంటిమి, ధన్యతగంటిమిగదా! ఆహా!

కృష్ణకుమారా! అవిదితప్రభాసారా! నిన్ను యోగులు కాంచ నేరరు. పరమజ్ఞానయోగులు తెలియజాలరు. మేము నీస్వరూపమును కనులార చూడగల్గుట మాపుణ్యావిశేషమేగదా ?

ఉ. కానరు యోగిపుంగవులు కానరు సౌఖ్యమతావలంబులున్
కానరు కర్మయోగులును కానరు భక్తివిశేషసిద్ధులున్
కానరు జ్ఞానసిద్ధులును కంజదళేక్షణ! నిన్ను కన్నులన్
కానఁగఁజేయు టెల్ల తొలిగల్గిన పుణ్యఫలంబు కాదొకో !

శా. శోకంబల్లన హెచ్చె, తాపగరిమన్ శోషిల్లెనంగంబు న
ద్రేకం బారగ శక్తిదూలె మన ముద్వేగంబునుం జెందె నీ
లోకం బారెను భంగితోచె నిను నాలోకింప కీధారుణిన్
శ్రీకారుణ్యపయోనిధీ! మనుదుమే చింతాగ్ని జీవింతుమే ?

[ప్రవేశము : అక్రూరుడు]

అక్రూ—అమ్మా! దేవకీదేవీ! నమస్కారములు. ఊరడిల్లుము, ఇంతలోననే నీ నందనుని దిలకింతువు లెమ్ము.

దేవ—అన్నా! అక్రూరా! నమ్మియున్న నీయట్టివాడుసైతము పయోముఖ విషకుంభమై నా నందనుని హింసింప సమకట్టియుండ నాకూరట యెట్లు కలుగు? జీవిత మెట్లు నిలుచును ?

అక్రూ—అమ్మా! ఎట్టి కర్ణకంటకములగు మాటలనాడితివి. ఆకంసుని దురుద్దేశమున దనతావుదప్పి, క్రూరభాషణములకు గడునొచ్చి కంసశాసనమున గళవళపడి, నాకు గలిగినయంతస్తాప దవానలమున మాడి వెలికి వచ్చిపోవు నాజీవిత లతను మొదలంట నేడు కోసివైచితివి? జననిరో స్వామియై, నన్ను మన్నించు ప్రోడయై, నాదైవదైవమైనగోవిందునికి నానోటివెంటకృతిమసంధానము వచింపవలయునేయనిదుఃఖించి దుఃఖించి భవా

దృఢసాధ్వీమణీ నానిష్కల్మషత్వము నెఱిగి, నా తాపము బాపు నుగదా యని నమ్మియుంటినిగదా ? యూరివారందఱు నన్ను దూషించుచున్నను పశ్చాత్తాపవహ్ని నన్ను గాల్చుచున్నను దుష్కృతమూలమగు నారక హాలాహలము నను లోలోన హింసించుచున్నను పరమపురంధ్రీమతల్లివగు నీయాదరణ మనెడిపట్టుకొమ్మయొకటియైన లభించునుగదాయనునూరటచే విసికివిసికి వసివాళువాడుచున్న నామానసతీవె నతిభారముగ మోసికొనియుంటినే? నాభక్తిభావన శీలముల నింతవఱకెఱిగి యున్న నీకే కరుణగలుగకయున్న నాబృందావనమునం దిం కెవ్వరు నాయం దక్కటిము జూపగలరు? తల్లిరో! నను భీక రాగ్నిజ్వాలకు నింతింత దహించియున్నను, సకల సంచయము లచే నాయంగము దుత్తునియలుగ ఛేదించియున్నను, నన్నొక తైలకటాహమునసుంచి సలసల కాచి భ్రమందించి యున్నను, మహాయంత్రమున నుంచి సకలావయవముల వేఱుపఱచియు న్నను, అంతయును సంతసమున భరించుచుంటిని కాని యిట్టి మర్మభేదనములై, జీవచ్ఛరీరహింసకములై, తాపాతితాపావ హములై, నిరత పాపోద్రేకములై, నీయట్టిసతీమణినోట వెంట వెలువడిన యీయపనిందావాక్యముల నేభరింపజాల. భరించి యిక బ్రదుకజాల. జననీ! మనోవాక్కాయకర్మముల నేక్షణ మునందైన నేఘడియనైన, నేయామమునైన, నేదినమున నైన, నామానసమిట్టి కల్మషావహ ఘోరవంచనకార్యమున కెడమిచ్చియుండిన మొగమెచ్చకములకైనను, మతిభ్రమచే నైనను యావేదాంతవీణాలోలు, రక్షితలోకజాలు, కరుణాల వాలు, మణిమయకపోలు, భక్తావనశీలు, నాగోపాలబాలునెడ దుశ్చింతన మొనర్చియుందునేని మదీయజిహ్వాగ్రమున క్రిమికీట

కములు జనించుగాక, అస్మదీయాంగంబునకు మూర్ఛా, క్షయ, కుష్ఠ, పాండురోగాదు లొక్కసారియే జనించి మల మూత్రములఁబొరలాడి, కాక, క్రిమి, గృధ్రకంబులచే భుజింప బడుగాక ! రౌరవాది నరక నివహంబులన్ని, నన్నులో గొని దుర్గంధ పూరితశోణితముల ముంచి నిమిషనిమిషమున కింతింత యెక్కువగ బాధింతురుగాక! ప్రాణావసానవేళయందు దిక్కులేక, నానోటనింతనీరు పోయువారైన లేక, శ్మశానంబున బొరలాడి ఘోరపిపాసాబాధితుడనై, నాయవయవంబులు మంటకలియునుగాక, అమ్మరో! ఇందుకు ధర్మాధిదేవతయగు యముడును భువనైకరక్షకులగు త్రిమూర్తులును, నెల్లవేళల నెల్లచర్యలబాయక చూచు సూర్యచంద్రాష్టదిక్పాలాది దేవతలును సాక్షులగుదురుగాక ! ఇంతకును నమ్మవైతివేని నన్నిదె నీశాపాగ్ని చేదహింపుము. వలదనను. (అనిచరణములబడును)

దేవ—[ఆలింగనముజేసికొని] అన్నా ! నీయాత్మశుద్ధినరయక పల్కిన మాటలకై గనలకుము. అక్రూరా! ఆకృష్ణుని నిందు దోడ్తేర కంసుడు తలచియున్నాఁడే. ఏమి చేయుదును? ఆకృష్ణునితో,

సీ. అలనాఁడు కలఁగాంచినట్టుల నినుఁబంపి
వంతఁ గుందెదమంచు పలుకు మన్న
పరమాత్మ! నిను పుత్రవరుని గాంచియు దుఃఖ
మునుగాంచ మాపాప మనఁ గదన్న
బంధనాలయములో బహుకాల మిఁక మేము
మనఁజాల మని నీవు వినుపు మన్న
అంతలో నొకసారి యమలవశా నీరూపు
వెలయఁ జూపుమటంచుఁ దెలుపుమన్న

ఆ. వె. కరుణమాని మమ్ముఁగాంచ నుపేక్షింప
మాదు ప్రాప్తియంచుఁ బలుకు మన్న
వేణుగోపబాలు వేడుకఁ దిలకించి
రాగదన్న శుభము తేగదన్న,

అక్రూ—అమ్మా! నీవేమియు భయపడకుము. కంసునకు కాల మాసన్నమైనది ఏదేవుని, శస్త్ర, వహ్ని, వాయువులు శోషింప జేయనేరవో, ఏపరంధాముని సంకల్ప వికల్పముల భువనములు జనించి లయించునో, అట్టివాని గంసు డేమియు చేయజాలడు. రాజాజ్ఞోల్లంఘన పాపము రాకుండ నా గోపాలదేవుని గొని తెచ్చుటకై పోవుచున్నవాడ. ఆ యుదంతము నీతో వచింప వచ్చితి. నాకానతిమ్ము, నేబోవలయు. శీఘ్రకాలమున నీ కుమారుని నీయొద్దకుఁ దెచ్చెద. (నమస్కరించును)

( దేవకీ వసుదేవు లాశీర్వదింతురు. యవనిక పడును )

# కృష్ణలీల నాటకము



## పంచమాంకము

1 వ రంగము—బృందావన సమీపారణ్యము

[ప్రవేశము : అక్రూరుడు]

అక్రూ—ఆహా! నేఁ జేసిన తపం బెంత కలదో! నే నొనరించిన వ్రతసముదయం బెంతకలదో! ఆ దేవదేవుని, నాశేషాహి శయనుని, నీలనీరదశ్యాముని, సోమనిభపాలుని, నా సకల లోకాభివందనుని, నంద నందనుఁ జూచుభాగ్య మబ్బెగదా!

ఉ. ఎట్టితపంబు చేయఁబడె? నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో?
యెట్టిధనంబు సర్థులకు నీఁబడెనో? తొలిజాము నందు నా
యట్టివివేక హీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్, హరిఁజూడఁగ ల్గెడిన్.

అయ్యో! సద్భావన లేక, కంసుఁ డొనర్చు వంచన విధానము నకై నేఁ బోవుచున్నాఁడఁగదా? నాయట్టి దురాత్ముఁ డెందైన నుండునే? మా గోవిందుని పాదారవింద సేవచే ధన్యుఁ డగుట మాని యతనిని బాధించుటకై కొనితేరఁ బోవుచున్నాఁడఁగదా? ఔరా యిది యంతయు బరసేవా ప్రయాసమున గలిగిన యనర్థము కదా? లోకమున జను లేల స్వాతంత్ర్యము నపేక్షింపక, పర

తంత్రములగు నుద్యోగముల నపేక్షించు చున్నారు ? ఉదరపోషణమే ఫలితార్థమని యెంచి విద్యల నభ్యసించుట సైతము పరుల సేవఁ జేయుట కయ్యే యనుకొనుచున్నారు. అయ్యో ! ఏది యెట్లున్న నేమి ? శ్రీకృష్ణమూర్తి దర్శనభాగ్యము కలుగును గదా ? ఒక విధముగ నాలోచింప కంసుడు నాకు పరమ మిత్రు డని తోచు చున్నది. అతనివద్ద నెందఱు సేవకు లుండలేదు ? వారి నందఱిని వలదని నన్ను శ్రీకృష్ణమూర్తిని బిలుచుటకై పంపియుండుటఁజూడ నాకంసునికి నాపైగల యకృత్రిమ ప్రేమానురాగమును సూచింపు చున్నది.

ఉ. శూరులు తొల్లి యేవిభుని శోభితపాదనఖప్రభావళిన్
  జేరి భవాంధకారమునఁ జిక్కక దాఁటుదు రట్టిదేవునిన్
  వైరముతోడనైనఁబిలువన్ ననుఁ బంచి శుభంబుఁ జేసె ని
  ష్కారణమైన ప్రేమ నిదె కంసునిఁ బోలు సఖుండు గల్గునే !

ఆహా ! అలకభ్రాజితమై, యలంకృత మయూరపింఛమై, యతి ప్రభామణి కుండల మండిత కర్ణమై యమితదయారసమై యంచిత మందహాస సుందరమై యొప్పారు నా సనకసనందనానందుని, నా యజరుద్రాది వందిత పాదారవిందుని, నాగోవిందుని మోము జూచు భాగ్యము కలుగునో కలుగదో తెలియదు. ఈ దురాత్ముడు కంసు పంపున వచ్చినవాడు; వీని దర్శింపఁ బాపమని యెంచి నాకు దర్శన మిచ్చునో యివ్వడో తెలియదు.

మ. ఇతఁ డాకంసునిచేతఁ బంపువడినన్ హింసింప నేతెంచినాఁ
  డతిదుష్టుండని చూచునో సకలభూతాంతర్బహిర్మధ్యసం
  గతుఁడౌటం దలపోసి దన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు
  న్నతిగాఁ జూచునో యేక్రియం బలుకునో నాభాగ్య మెట్లున్నదో

(యోజించి) నే నేల చింతింపవలయు ? సకల భూతాంతర్యామియై సర్వజ్ఞుండగు నా పరాత్పరునకు నామానసశుద్ధి తెలియకుండునా ? అవశ్యము నా కాముకుంమని సాక్షాత్సందర్శనభాగ్య మబ్బుటకు సందియము లేదు. మృగము లెడమనుండి కుడికేగుచున్నవి. భళిరే ! నేను సాయంకాలమున జని యా వైకుంఠ మహిమానందము, నా బృందారక పురీరక్షణానందము నా గోవింద పాదారవింద దివ్యరేఖా మందిరము నమేయభాగ్యబృందమునగు నా బృందావనము జొచ్చి యందు నందుని మందిరమునొంది, యందు ప్రకాశించు దివ్యప్రభారోచిష్ణుల, సకల దానవ జయిష్ణుల, దివ్యకౌస్తుభాలంకరిష్ణుల, రామకృష్ణుల దర్శించి సాష్టాంగదండ ప్రమాణంబు లాచరించిన నా భక్తవత్సలుడు శ్రీ లక్ష్మీకుచసంపత్కరమై, భక్తిమోక్ష శ్రీకరమై, సనకాది చిత్తవశీకరమై, భువనత్రయ రక్షాకరమై ప్రహ్లాదాది మస్తక విభాకరమై వెలరారు నా యభయకరంబు, నా యాదల మోపిన నా తపంబు ఫలింపదె ? నా భక్తి యీడేరదే ! నాకోర్కె కడతేరదే ? చూచెదగాక.

ఉ. మాపటివేళ నేను జని మాధవు పాదసమీపమందు దం
డాపతితుండనైన నతం డాశుగ కాలభుజంగ వేగ సం
తాపిత భక్తలోక భయదారుణమైన కరాబ్జ మాందలన్
మోపి హసించి నా కభయమున్ గృపతోడుత నీయకుండునే.

(నిష్క్రమణము)

2 వ రంగము : బృందావనము, నందునిభవనము

[బలరామ కృష్ణులును, యశోదయు, నందుడును కూర్చుండి యుందురు. గోపబాలకులు సేవజేయుదురు]

యశో—అన్నా! కృష్ణా! నిన్ను మనగోపకు లందఱు నిత డెవ్వడో మహానీయు డని చెప్పుచున్నారే? నిజమా?

శ్రీకృ—అంత యుంగల్ల. నాగరికత తెలియని బాలకు లట్లు చెప్పుచున్నారు. ఇపుడు మహానీయుల మని కుంకుమ రేఖలు పెట్టి వేదాంతుల మని రుద్రాక్షమాలికల ధరించుకొనియుండు లోకవంచకులు ప్రబలియున్నారు. గనుక నేనును నెమలి పింఛము ధరించిన, వారట్లు చెప్పుచున్నారు.

యశో—అది కాదు నాయనా! బ్రాహ్మణులుకూడ నిన్ను దేవదేవు డని చెప్పుచున్నారే? దీని కేమనెదవు?

శ్రీకృ—బ్రాహ్మణులా! వారేమి, కొంచము దక్షిణ యిచ్చిన గావలసినంత పొగడుదురు.

యశో—ఏమో! నీ మహిమ యొక్కటియు దెలియకున్నది.

సీ స మా లి క

యశో—అన్నరో! మనయూరి పిన్న పెద్దలు నిన్ను
శ్రీహరి యని రేమొ చెప్పుమన్న!
శ్రీకృ—గోపబాలకుఁ డేడ గోవిందుఁ డేడ నా
పిచ్చిమాటల నింక మెచ్చకమ్మ!
యశో—ఒప్పార గోవర్ధనోద్ధారి వని ద్విజుల్
పలికిరి యది యేమొ పలుకుమన్న!
శ్రీకృ—భోజనం బిడ మహారాజని వినుతించు
నెమ్మి బాపలమాట నమ్మకమ్మ!

యశో—బొజ్జలో లోకముల్ పోషింతు వని గర్గ
 ముని చెప్పె నది యేమొ వినుపు మన్న!
శ్రీకృ—వృద్ధుల కెంద్రైన బుద్ధిమాంద్యముగాదె
 వారిమాటల వినవలవ దమ్మ!
యశో—సాక్ష్య మేటికి, నేను జగముల నీనోటఁ
 జూచితి నది యేమి చోద్య మన్న!
శ్రీకృ—అమ్మ! చిత్తభ్రమణమ్మ నీ కయ్యెగా
 కెటుల నోటను జగం బెనయు నమ్మ!
యశో—గీ. ఏమి రీతియొ, నీకథ యేమి కలదొ
 యేది తెలియదు గోపాల! నీదులీల
శ్రీకృ— నీకుమారుని కథలను నీ వెఱుఁగవె
 భ్రాంతి వలదమ్మ! చేకొమ్మ! రాఁగదమ్మ!
బల—అమ్మా! మనకృష్ణుని నీ వొప్పింపజాలుదువా? వాని మర్మము వానికే తెలియును.
నందు—కాంతామణీ! ఏమియుఁదెలియని పసికూన నేమేమో పర్వతోద్ధారుడవని, లోకేశుడవని యూరక నాడికొనుట తగదు ఇక లోకు లందరన్న నది వారికి నైసర్గికము. శక్తిలేని వస్తువులయం దొక్కడు మహిమ యున్న దని భ్రాంతిపడెనా యందఱు వానినే యనుసరింతురు.
 సీ. పసిఁడిశాలువ నెంతొ భరముగ ధరియించు
 నీపాప బలుకొండ నెత్తఁగలఁడె?
 వేణువు మోమున నూనఁజాలని కుఱ్ఱఁ
 డాఫణిఫణనీమ లాడఁగలఁడె?
 లేమెండ కసిగందు లీలల బొలుఁడు
 మేలి కార్చిచ్చును మ్రింగఁగలఁడె?

కనుల నిట్టుగఁజేసి కాంచిన వేపాటు
  కాన రక్కసులను గూల్చఁగలఁడె

గీ. జాడ కానఁడు పరుషోక్తు లాడఁగనఁడు
వేడుకలఁ బోడు ఆటల నాడ లేఁడు
చూడఁజాలఁడు కోర్కెల వేఁడరాఁడు
వాడిమగఁ డౌనె గోపాలబాలుఁ డకట.

శ్రీకృ—జనకా! అంతయే! నే కనుమూసితినా! ఒక్కటియు లేదు. కనులు దెఱచితినా, అంతయుఁగలదు. నాశక్తియే నాకుగాని, వేఱుశక్తిగానను. అన్నియు విందును. అన్నియు నను విన లేవు. ఇట్టివానిని లోకు లేమేమో యనుకొందురు. వారిని మెప్పించుట మనకు సాధ్యమా?

[ప్రవేశము : ఒక గోపాలుడు]

గోపా—గోపాలదేవా! ఎవరో అక్రూరుఁడట. మధురాపురినుండి వచ్చి యున్నాడు.

శ్రీకృ—అక్రూరుడా? త్వరగా నతనిని బిలుచుకొనిరమ్ము.

గోపా—భాగ్యము. (నిష్క్రమణము)

[ప్రవేశము : అక్రూరుడు శ్రీకృష్ణునికి నమస్కరించును]

శ్రీకృ—అక్రూరా! కూరుచుండుము. మధురాపురిలో మా మాతా మహుఁ డుగ్రసేనుడు క్షేమముగా నున్నాడా? మా మామ కంసునికి కుశలమా?

అక్రూ—దేవా! అందఱును క్షేమముగానున్నారు. అంతకంటె పూజనీయులగువారి క్షేమమును మీరడిగినను నడుగకపోయి నను నే జెప్పవలసియున్నది. నిను నందనునిగా బడసినవారు సయితము ప్రమోద మానసులై యున్నవారు.

శ్రీకృ—నీవనునది మాజననీజనకులగు దేవకీవసుదేవుల విషయమా? వారిని పాదాభివందనము జేసి కుశల మడుగవలసి యున్నది.

అక్రూరా! నీవు వచ్చునప్పుడు మాజననీజనకులేమైన జెప్పిరా?
లేక ప్రాణావశిష్టులై వగచే నేమియుఁబలుకరైరా?

శా. నిన్నా కంసుఁడు పంపగావినిరొ. నిన్వీక్షింపలేకుండిరో
అన్నీచాత్మని భృత్యుఁడంచునిను మాటాడింపఁగారోసిరో
కన్నీరిధరబారఁ గంసుచరితల్ గాఢంబుఁగా బల్కిరో
అన్నా! పల్కుముతలిదండ్రు లిటున న్నాశించిరో స్రుక్కిరో.

అక్రూ—దేవా! సర్వేశ్వరుండవగు నీకు దెలియని యర్థంతముగలదా? అయినను వచించెద. నీజననీజనకులు కంసునిచే బాధితులై దినమొక్కయుగముగా కాలము గడుపుచున్నారు. నీవెప్పుడు చనుదెంచి ప్రేమనిండార దమ్ము బంధవిముక్తుల జేయుదువో యని యనవరతము నీరాకకై యెదురు చూచుచున్నవారు. మరియుఁ త్రిలోకాధినాథుడగు భవాదృశతనూజుడు తమకు గలిగియుండియు నెనలేని కడగండ్లకు లోనగుట తమ దుర దృష్టమని వచింపుమని చెప్పియున్నారు.

శ్రీకృ—అక్రూరా! దేనికిని సమయము రావలయునుకదా? నేను దూరమున నున్నను, వారి కష్టదశ క్షణక్షణమునను నామది యందు మెదలుచునే యున్నది. కానిమ్ము; అది యుండనీ; నీవు రాకరాక వచ్చితివి? నీరాక యేదియో యొక విశేష మును సూచింపుచున్నది.

అక్రూ—దేవా! నీకంటె విశేషము గలదా? మీమామ ధనుర్యా గము జేయబూని మేనల్లుండ్రగు మీ సన్నిధానము నపేక్షించి మిమ్ముఁదోడ్కొని రమ్మని నన్నుఁబంచియున్నాడు. రేపు ప్రాతఃకాలముననే పయనము కమ్మనియు జెప్పమన్నాడు.

శ్రీకృ—అట్లనా? మామామ కంసుని కల్లుండ్రపైన మిక్కిలి ప్రేమ గనుకనే నాయన యానతి శిరసావహించివచ్చెదను. తల్లీ!

నాకానతిమ్ము నేఁబోయి మామామ యజ్ఞమును సాంగముజేసి వచ్చెదను. లోకమునకు సంతోషమును గలుగఁ జేసెదను.

యశో— కుమారా! కంసుని యజ్ఞముతో మన కేమి? పెద్దవారు యింటికి బిలుచు టొక్కటియేగాని మర్యాదయుండదు. బీదవారు వారికంటె కగపడరు. ఇదియుగాక కంసునకు మనయందుగల యవ్యాజ కరుణయందుమా యది పరమాద్భుతము? కట్టా! పూతనను బంపి తృణవర్తాది రక్కసులం బంపి, నిన్ను గడతేర్ప జూడలేదా? నీమరణమునకై యనవరత మువ్విళ్ళూరుచున్నాఁడని మనము వినలేదా? అట్టిచోటికేల పోవలయు?

శ్రీకృ—జననీ! అట్లుకాదు, నేను పట్టుపడను. మామామకు దివ్యసుఖము నివ్వక మానను. నన్ను జూచిన సంతోషమున మామామ యీలోకముననుండునా? ఏమియు భయపడకుము. పూతనా శకటాసురులనుండి కాపాడిన నాటి దైవము నేడు లేడా? నాకార్యమంతయు దుదముట్టించి వచ్చెద. ముఖ్యముగ కంసుని పని దీర్చివచ్చెదను.

యశో—తనయా! పోయిరమ్ము; నీమాట కేమియు బదులు చెప్పజాలను. అయిన నీవు జనించిన నాటినుండియు నేనీ ప్రపంచమునే మరచియుంటిని. లోకమోహనమైన నీ చిరుమేనును లోకాద్భుతములగు నీబాలక్రీడలను, లోకోత్తరములగు నీ ముద్దుల పలుకులును, నామదిని నాటియున్నవి. నిన్ను బుత్రుఁడని శాసింపజాలను, అన్యుఁడని యుపేక్షింపజాలను. నాగోపాలుడ వని సంతసింపఁజాలను. వలదనఁజాలను. బోధింపజాలను. కుమారా! నా మానసమును, నా సర్వైహికాశలును, కోర్కెలును, నా గారాబమ్ములును, నా పంచప్రాణములును నీవే యని నమ్మియున్న

దానను నీవు తల్లి వని భావించినను గురు వని మన్నించినను పూజనీయురా లని యాదరించినను సరియే నీవు లేనిలోకమే నాకు లేదు. నిన్నుఁజూడని లోకమే నాకుఁ గానరాదు. గోపాలా! నీవు మరలి వచ్చువఱకును నిమిషమొక్క బ్రహ్మ కల్పముగాఁగడపుచుండెదను. నీ కార్యములకు నీవు చేయ నెంచిన కార్యములకు సత్యాధిదేవతలు సహాయులై యుందురు గాక! నీ శరీరావయవమ్ముల నశ్వినులును, వాయువును, ఇంద్రోపేంద్రులును రక్షింతురు గాక. అన్నా! నీవెక్కడ నిలచిన నదియే పరమపదము. నీవాక్యమే వేదవాక్యము, నీకృత్యము పరమార్థము. అట్టిచో నన్ను మరువకుము. నీ మాతయగు నా మాటలం దింత విశ్వాస ముంచుము. ఈ రేపల్లెకు మరలి నీవు వచ్చువఱకును నే నీ లోకమునే మఱచి యుందును.

సీ. మందార మబ్బిన మందభాగ్యయుబోలె
నురుతరామోదనై యుంటి నన్న
నినుబోలు తనయుండు ననుఁజేరి యుండ నా
యసమతపఃఫలం బంటి నన్న
అమృతబిందులఁ జిల్కు నందందు నీముద్దు
లాలించి యది స్వర్గ మంటినన్న
నిమిషంబు గనకున్న నిఖిలంబు కానలో
కాచినవెన్నెలై తోఁచు నన్న

గీ. మిత్రశత్రుల నారసి మెలఁగుచున్న
యెల్ల దేవత లామోద మిత్తురన్న
సేమ మొప్పార మఱి మమ్ము చేర వన్న
పోయి రావన్న శుభములఁ బొందవన్న.

శ్రీకృ—

సీ. పరమాద్భుతక్రియాచరుఁ డైన నాకునై
  మెనలేని యీచింత లేల నమ్మ ?
మామామ మామహోమహామున చరియింప
  ఘనలోకభద్రముల్ కలుగు నమ్మ
కలుగదే విరహంబు చెలగదే ప్రమదంబు
  సుఖదుఃఖపర్యాప్తిఁ జూడు మమ్మ
శకటాదిసంహారసమయదయాళు వౌ
  ఘనదైవ మీనాఁడు గలుగఁ డమ్మ?

గీ. చెలగి భవదీయశుభతరాశిషము లొంద
కలుగ వే దురితము లంచుఁ దెలియ వమ్మ
ఫలిత కాంక్షిత నే వేగ వత్తునమ్మ
పరమ శుభమున నన్నింకఁ బనుప వమ్మ.

యశో—పోయిరమ్ము. మార్గమున నీకు శుభంబయ్యెడుఁగాక.

శ్రీకృ—తండ్రీ! నాకు నానతియా ?

నందు—కృష్ణా! నే నేమందును ?

సీ. చిటిపాపఁడౌ నీకు చెనటి పూతనబారి
  గండ మొక్కటి నాఁడు కలిగెనన్న
అందందు మంటిలో నాటాడ సుడిగాలి
  గండ మింకొక్కటి కలిగె నన్న
బాలలీలల నొప్పు బాలుఁడై శకటాసు
  రునిచేత కష్టముల్ కనితి వన్న
అన్నరో! యొకనాఁడు కన్నార సుఖనిద్ర
  గాంచక కష్టింప గంటి వన్న

గీ. ఇపుడు కంసుని చెంతకు నేగ కన్న
ఏమి కష్టముకలుగునో యెఱుఁగనన్న
పూని మామాట నాలింపఁ బోలునన్న
మమతఁ నినుబాసి మేమెట్లు మనుదు మన్న.

కుమారా నీవెవరవో, మేమెవర మో, తెలియజాలము. నీవు పోయిన నే శుభము కలుగునో యే యశుభము సంభవించునో తెలియదు. నీ రంగారు సముచితాలాపముల వినుచున్న బృందావనమున నున్న గోపాలురను, గోపకాంతలును, గోవులును, గోశిశువులును తమతమ యాహారముల మాని నీవిరహ దుఃఖము సహింప జాలకుందురు. కంసునిచే, నృశంసునిచే మాకెన్నియో కష్టములు కలుగుచున్నవికదా? కృష్ణా ! నీయభిమతమునకు మారాడజాలను. కావున పోయిరమ్ము. నీకార్యము సఫలమగుగాక.

శ్రీకృ—(తల్లిదండ్రులకు నమస్కరించి)

అనుబంధము 44

(గోపకాంతలజూచి) గోపకామినులారా ! మదుదారకరుణాభూషితలారా! నాకానతిండు. మధురాపురి జేరిమామామకు శాశ్వత సుఖ మొసగి, సిద్ధార్థుడనయి లోకముదంబును, విబుధాలోకముదంబును, పౌరజనాస్మదీయా లోకముదంబును, నొసంగి, వచ్చెద. మీనిర్మలచంద్రాలోక హృదయశీమలయందుకృపారసము ప్రతిఫలింపనన్నాశీర్వదించి పంపుడు. మీరును నిరంతర స్త్రీధర్మపరిపాలికలై పాతివ్రత్యాలంకార విరాజితులై యుండుడు.

గోపి—కృష్ణా ! నీకిది ధర్మమా ? నీ యాశ్రయమే సకల దురిత లతాలవిత్రముగ, నీ పాదారవింద ధ్యానమే నిరుపమాన వైకుంఠసోపానముగ, నీదయావీక్షణమే యక్షీణ మోహాబ్ధి

రాజ్యపదవిగా, భవదీయ సాక్షాత్కారమే బ్రహ్మానందవిభూతిగా నెంచు మమ్ములను మహోదధియందు, నావ జనులను ముంచినట్లపార భవసముద్రమున ముంప జూచెదవే ?

2 వ గోపి—ఈగుణహీనుని, నీమహావంచకుని నమ్మియున్నదంతయు బాసి లేనిదాని కెదురుచూచుచున్నారు. ఇంక నితనినిపూజింప రాదు. మనమనఃపాశముల బంధింతము. ఇతడు నిర్బంధించినగాని నిలువడు. నిలచినను కానుపింపడు. కనుపించినను సూక్ష్మాకారుండుగా నుండును.

1 వ గోపి—

సీ. గుణహీనుడని పట్టుకొనకూడ దందమా
అమల సద్గుణజాలహారుఁ డితఁడు
ఆకారశూన్యుఁడై యలరునం చందమా
అఖిలలోకాకారుడౌచు నొప్పు
నొక్కచో నిలువక చిక్కడం చందమా
చిక్కుబాసినవారిచెంత నుండు
ఇక్కడలేఁడు ! తానిక్కడకలఁ డని
చూతమా తలచిన చోటనుండు

గీ. వాని, కనవాని వెద్దులవాని. కాని
రూపువాని, తనంతట నోపువాని
మదిని బంధించి సాధించి పదిలపఱచి
నిలువచేతము రారె యో నెలఁతలార !

శ్రీకృ—అయ్యో ! అళికసాలాలకలారా ! నే నెందయిన పోవుదునా ?
నే బోవునది భువనపరిత్రాణమునకై యే గదా ?

సీ. భువనావనాలోల భవనాశనాశీల
జనన మొందుట యింత గనఁగవలదె ?

ఫలితాఖిల క్రియా కలితాల సత్ప్రియో
జ్వలుఁ డౌచు వచ్చుట తెలియవలదె ?
బల రారసంహారమును మీఱ నొక లవ
కాల మంచును మదిఁ గాంచవలదె ?
ఘటితార్థ విఘటనా ఘటితార్థఘటనార్థ
దైవకృత్యము దీని తలఁపవలదె ?

గీ. సంతతానంత ప్రోత్సాహశక్తి మీఱ
పరమ కల్యాణవాద్యముల్ పలుకవలదె
నిరుపమాశిషసంతతి నెఱపవలదె
భవ్యరీతిని నను నింకఁ బనుపవలదె.

2 వ గో—కృష్ణా! సరసీజేక్షణా! పరమ సౌహార్ద్రభాస్వరశీలుడగు నీకిది పాడియా ?

మ. సరసీజేక్షణ! నీకటాక్షరుచి విస్ఫారామృతాసారశీ
కరశాంతాఖిలతాపసంతతులమై కాలుష్యమున్ బాసినీ
దరహాసామలచంద్రచంద్రికల నిత్యక్రీడతో నుండ ని
ష్కరుణన్ మమ్మిటుఁ బాయఁ బాడియెజగత్కల్యాణసంధాయకా!

3 వ గోపి—

శా. వైరాగ్యామలవృత్తిలేమ విలసద్భక్తి ప్రభా యోగ మే
పారన్ లేదిటు శాంతిదాంతి గుణసద్భావంబు రానేర దీ
నారీజన్మము హేయమౌ మునివరుల్ నవ్యప్రబోధంబునన్
జేరఁ రాని పదంబు కోరుటలు మాస్త్రీచాపలంబీశ్వరా.

4 వ గోపి —

చ. జగములు తానె పెంచి భవసాగర దుఃఖతరంగమాలికన్
వగఁ గనఁజేసి పూర్వకృత పాపఫలంబున నీకు సత్కృపా
నుగత విభావ మెక్కడిది నూతనపంచక వేఁటకానికిన్
వగచు మయూరి బాష్పముల పాపమటంచని జాలికల్గునే.

**5 వ గోపి—**

చ. పురుషులకే దయారసము పుట్టదు నెన్నుది కర్మశంబనన్
పురుషవరేణ్యః డీవుకృపఁబూనగ నేర్తువె యాశ్రితావళిఁ
పరమమనోవ్యథఁ వగలపా లొనరింతువు, పాపిబృందమున్
సిరుల నొసంగ జూతువు విశేషవిరుద్ధుఁడ వీవు మాధవా!

శ్రీకృ—కలవాణులారా! నాస్వరూపము మీహృదయసీమయందు తప్ప నేరదు. మన్మూర్తిదర్శన పూజన సంసేవనంబులు మీ కెన్నటికిని తప్పనేరవు. అదెట్లన్న వినుడు.

చ తరుణుల పుణ్యరూపము, వ్రతప్రకరాంచిత సిద్ధరూపమున్
సురుచిర భక్తిభాగ్య పరిశోభిత రూపము, పుణ్యతీర్థ సం
స్ఫురదురురూప మాంగమనిబోధితరూపము దేవరూపమున్
తిరమగు మోక్షరూపము పతివ్రత కెందుల భర్తృరూపమున్.

చ. పతి కెదురేగుచో రుచిరపాద్య మొసంగుచు పీఠి నిల్పుచో
అతిశయభక్తితో జలకమాడఁగ జేయుచు పూజ సల్పుచో
మతి కమలాసనస్థితి సమంచితరూపము నెన్ను టొప్ప నా
కతులసపర్యఁ జేయుటయె యన్యము కాదది బుద్ధి చూడుడీ.

1 గో—దేవాదిదేవా! చరాచరములు నీవయై వెలుగొందుచున్న వాడవయ్యును అజ్ఞానావృత చేతస్కులమై భవదీయమూర్తి సందర్శన విరహమును సహింపజాలకున్నారము. మాయామయుడవైన నీ సురుచిరమాయచే సరసీజాసనాది మహాదేవతలు మోహితులై కడతేర జాలకున్నారట! మే మెంతటి వారము? నీవెట్లునుభక్తరక్షణమునకై భక్తశత్రుశిక్షణమునకై భక్తకామినీరక్షణమునకై భక్తపౌరజన రక్షణమునకై వెడల దలంచియున్నాడవు. పొడసూప నెంచి యున్నాడవు. నిన్ను వద్దన జాలము. కావున పోయిరమ్ము సర్వశుభములతో మరల గోకులమును జేరుము. భవత్పునర్దర్శనము. సుజ్ఞా

దర్శనము, సుజనయోగ దర్శనము, పరమతారక దర్శనము మోక్షాధి రాజ్యదర్శనము శీఘ్రకాలమున నొసంగుము. అక్రూరా! నిన్ను మేమెంతయు నిందింపవలసి యున్నను స్త్రీచాపలమునుమాని, పరమార్థదర్శన మూని, నిన్ను వేడు వారము. ఎటుల మాకృష్ణుని సుఖముగఁ గొనిపోయెదవో, యెటుల మాగోపాలునకు నావంతయిన వంత గలుగనీయక మధురాపురిఁ జేర్చి మధుర కార్యసమారంభ ఫలమును జేకూర్చి మాకప్పగించెదవో, యెటుల మాపొగడికోలు వడసెదవో! వాసుదేవా! ఇదియే భవదీయ చరణారవిందములకు నమస్కరించువారము. (అందఱు నమస్కరింతురు)

శ్రీకృ—గోపిగామణులారా? మీభక్తికి మెచ్చితి. మీ రెప్పుడు ఎందు ఎటుల తలచెదరో అటుల నా దివ్యతర స్వరూపము మీ మానస వీధులందు తప్పక యుండుగాక! అక్రూరా! ప్రొద్దయినది వెళ్ళుదము రమ్ము. (నిష్క్రమణము)

పంచమాంకము—౩ వ రంగము

మధురాపట్టణము—రాజనగరు

[కంసుడుండును]

కంస—ఔరా! నే డేలనో నాకారాటము కలుగుచున్నది. మనంబున నే కలయందైన నెఱుంగని భీతిగలుగుచున్నది. అనవరతము నాపగతుని నాగోపాలహంతకుని స్మరించుచుండుటచేత నాకిట్టి మతిభ్రమ కలిగియుండునా?

మ. మనమారాటముఁ జెందె, భీతికలిగెన్ మాంద్యంబుపైఁ గప్పె లో
నను ధైర్యంబుతొలంగెలోకమును శూన్యంబౌచుఁ గాన్పించెనా
ఘనమౌశక్తియుఁ దగ్గె నేమికతమో కంసుండఁగానో మహా
నటనల్ గల్గెడినేమె కృష్ణుఁ డరియై బాధించునో యక్కటా.

[ప్రవేశము : అక్రూరుడు]

అక్రూ—కంసరాజేంద్రా! తమ యానతిమేరకు బలరామ కృష్ణుల దోడ్తెచ్చియున్నాను.

కంస—సెబాస్. అక్రూరా! అట్లుండవలయు. చూచి రమ్మనఁ గాల్చిరావలయు, వారి నాస్థానమునకుఁ దోడ్కొని రమ్ము పొమ్ము.

అక్రూ—భాగ్యము. (నిష్క్రమణము)

కంస—ఔరా! అక్రూరుడు వచ్చి బలరామకృష్ణులఁ దోడ్తెచ్చితినని నంతనే నాకాలు చేతులు గడగడ వణకఁజొచ్చె. అయ్యో! నేఁడేల నాకీ పిరికితనము గలిగె? దుర్వార ప్రతిపక్షగంధ సింధుర కుంభస్థలములఁ జీల్చి యాణిముత్తియములను రాజ లక్ష్మికి దలంబ్రాలు పోయజాలు నీ వీరశిఖామణికి శాత్రుపుఁ డెదు రేతెంచిన నీకాందిశీకత్వ మెక్కడనుండి వచ్చెను? హృదయమా! హృదయాంతరాళ నిమగ్న చండవిక్రమక్ర మమా! ఏల నీ విజృంభణముఁ జూపక చల్లపడియెదవు? రమ్ము నాయందు ప్రకాశింపుము. వీరవర్గ నిందనీయ మగు తుచ్ఛ భయమా! అట్టి యీకంసుని నుండి వెడలిపొమ్ము. కరవాలమా! అరిమాలాకంధరపరిహరణకాలమా! నీవొక్క డవు, నాహస్తమునందు పదిలముగా నిలువుము. ఔరా! నే నెట్టివెకలి నైతిని? నామిత్రులగు జరాసంధాదుల సహాయము నపేక్షింప కృత్రిమోపాయమున కార్యము సాధింపసమకట్టి తినే? ఈ బాలుడు నిక్కముగా నా మారణకృత్యమునకై భూమినవతరించినయాహరియేమైయుండవచ్చునా? కానిమ్ము వాని సామర్థ్యముఁజూచెదగాక. (నిష్క్రమణము)

## పంచమాంకము—4 వ రంగము

### మథురాపట్టణము—రాజాస్థానము

[కంసరాజు, మంత్రులు, సేనకులు మొదలగువా రుందురు]

కంస—మంత్రిపుంగవులారా! ఇంతటితోనే యాగోపాలుడు వీరాగ్రేసరుడని మీరు జంకరాదు. కువలయాపీడ మను గజమును సంహరించె నని కదా మీరింత భయపడసాగితిరి? ఆయేనుగు కడుంగడు ముసలిది. నేడో రేపో చావనై యుండెను. అట్టి దానిని వధించు టొక్కయబ్బురమా! అదియు గాక యా మాయానటకుడగు కృష్ణున కేదియో మంత్రమణ్యౌషధీప్రభావ ముండవచ్చును. దానికయ్యే నేను చాణూరముష్టికాసురులను బంపియున్నాడను. ఇంకొక క్షణమునకు నాశత్రువు మృతుండయ్యె ననువార్త చల్లగా వీనులార విని సంతసింతుముగాక.

లంబ—నాకేమో ప్రకృతము వానితో సంధిచేసికొనుటయే యెంతయు భావ్య మని తోచుచున్నది. వాండెక్కడి బాలుండు! చూచిన సురాధిపతినయిన ద్రుందజేయు కువలయాపీడద్విరద రాజమును చపుంటు యన్న సమస్తలోకముల జంపు ననుటయే.

ఉష్ట్రి—వాడు సంవర్తకాల సంరాజన్మధ్యందిన మార్తాండుడు. అస్మదీయ దానవ కాలాహుతుల వేలార్చ నిలాతలమున జనించిన పన్నగవైరి. వానితోడవైరమే వలదని తోచుచున్నది.

[ప్రవేశము—శీఘ్రయానమున నొక సేవకుడు]

సేవ—రాజేంద్ర! కాపాడుము! కాపాడుము. మృత్యుముఖము నుండి మమ్ముల దప్పింపుము.

కంస—సేవకా! ఏమి యేమి ? ఏమి యీ యాగడము ? నీకు గలిగిన యాపదయేమి ? వచింపుము.

సేవ—దేవ! ఏమి చెప్పుదును? అయ్యో! అయ్యో! ఇం కేమిగతి ?

కంస—(కోపముతో) సేవకాధమా! సత్వరముగ వచింపుము. ఏల యాలస్య మొనర్చెదవు ?

సేవ—(వణకుచు) అయ్యో! యేమి చెప్పుదును ? మన చాణూర ముష్టికాసురులు—

కంస—వారి కేమైనది ? వా రెందున్నారు ?

సేవ—అబ్బా! ఏమి చెప్పుదును ? వారాగోపాలకృష్ణుని బారికిబడి నీల్గిరి.

కంస—ఔనా! ఔనా! నిజమా? చాణూర ముష్టికులు చచ్చిరా ? (మంత్రులు మొదలగువారు భయ మభినయింతురు) దానవ నాయకులారా! మీరేమియు భయపడకుడు. ఇకవాఁడెందు పోగలడు? భీకరకంఠీరవము నెదుర్కొను మృగశాబకంబు పగిది, ఆకొన్న శార్దూలమును మార్కొన్న మేషకిశోరంబురీతి వాడు నాకుతోలిముద్ద కాగలడు. రానిండు మద్భుజారాహు రసనాగ్రమునకు వాని ప్రాణచంద్రుని నాహారంబుగావించెద.

[ప్రవేశము : శ్రీకృష్ణుడు]

శ్రీకృ—మామా! మీకల్లుడై, రేపల్లెయందు పెరుగుచున్న బాలుడైయున్న గోపాలకృష్ణుడు నమస్కరించుచున్నాడు.

(అని నమస్కరించును)

కంస—ఓరీ? నాకల్లుఁడగుటకు నీయట్టి పిఱికిపంద తగునా ? వెన్న దొంగా! నీవేనా రేపల్లెయం దింటింట పాలు, పెరుగు దొంగిలించుచు, ఆడవాండ్రను గాంచి దుష్టతన మొనర్చుచు వారి చీరల నపహరించుచుండిన పాపకర్ముండవు ? అధమా! వారు

నాయొద్ద మొరబెట్టుకొనియున్నారు. అందుకై నిను బిలిపించితిని. ఇపుడు నీవు నిండపరాధి వగుకొనుము గాని నామేనల్లుడవను కొనకుము. పాపకార్యము నొనర్చినవాఁడల్లుడయిన సరియే, గొల్లవాడయినను సరియే. వానిని వధింపనేవలయు.

శ్రీకృ—మామా! ఏమి నీన్యాయము! ఏమి నీధర్మము! ఏమి నీరాజ్యపరిపాలనము, నీయసమానపాండిత్యము గొల్లవారి కెక్కడ రావలయు? వచ్చిన యల్లుండ్రకు మేనమామ ప్రేమాలింగనమో, కుశలసంభాషణమో, పరమాదరణమో, చేయుట మాని కినుక గదిరిన కనుబొమరల రక్తము గ్రక్కుచు మాటాడ బోలునే?

మ. పలుకో, పామరమో, మహాదరణమో, పక్వాన్నముల్ పెట్టుటో
వలువల్ కట్టుటో, సేమవార్తవినుటో, బాంధవ్యమున్ పెంచుటో
యిలమర్యాదలు మేనమామలకు తామే తేర నల్లుండ్ర నా
శలు పోవన్ మదిఁగోపగింతురె మనీషన్ కంసభూపాలకా!

కంస—ఓరీ! నీవల్లుడ వగుదువా? నీకు మర్యాద కావలయునా? మత్కరవాల నిశితధారాకాలభుజంగమునకు నీప్రాణవాయువు లర్పించుటయే నాకు నీయెడ చేయదగిన మర్యాద. వెన్న దొంగవు, నీకేల మానమర్యాదలు?

శ్రీకృ—మామా! ఆవెన్నను నీవు చూచియెఱుంగవు. ఆ వెన్న నీకును నీసదృశులగు వారికి పొంద నసాధ్యమైనది. జరామరణముల గలిగించనిది. సనకసనందనాదులకును పొంద నసాధ్యమైనది. వేదవేదాంగములకైనను కానరానిది. మద్భక్తులకు మాత్రము పొందదగినది.

సీ. పెరుగుచిల్కుట లేక పెరుగుచుండెడివెన్న
అగ్నిలో కరుగక నలరువెన్న
ధనమదాంధులు పొందదగక వెల్గెడివెన్న
కౌపీనధనులకు కలుగువెన్న
పాడిపంటలులేక పరగుచుండెడివెన్న
క్షీరసాగరమందు చెలగువెన్న
భుజియింప క్షీణమై పోవకుండెడివెన్న
కేలనంటగరాక గ్రాలువెన్న

గీ. ఎంతకష్టించినను చిక్కకేనయు వెన్న
లీలభవరోగముల పారదోలు వెన్న
చూడరానట్టి వెన్న నన్ జూచువెన్న
కాంచదుర్లభ మావెన్న కంసమామ?

కంస—బాలకాధమా! సురాసురులు మదీయ భ్రూసంచలనమున సంచలించుచుందురు. అట్టి నాయెదుట నిర్భయుడవై, నిశ్శంకుడవై నిర్లజ్జుడవై సంభాషించుచున్నాడవే? మత్తగజేంద్రము పిపీలికను నణచుభంగి నిన్నొక నఖరాగ్రమున నణపజాలనా? నీ వేశక్తిని నమ్మి నన్నెదిరించెదవు!

శ్రీకృ— నాశక్తియా? వినుము.

మ. వరసృష్టిస్థితినాశశక్తి, భువనవ్యామోహనాశక్తి, శ్రీకరభక్తావనశక్తి, బ్రహ్మహరసాక్షాద్రూప సంశక్తి, నీ
ఖరఖడ్గోల్లస దాదిశక్తి ఘనమోక్షద్వారచిచ్ఛక్తి, భాస్కరసోమాంచితశక్తి నాకు నదియే సైదోడు భూపాలకా.

కంస—బాలకా! నీకై పూతనను బంపితిని. అది చిరకాలరోగార్తమైనకతమున నిన్ను జూడగనేప్రాణములవాసె. తృణావర్త

శకటాసురాదు లన్ననో ముదుసలు లైనందున నీచేత జంప బడిరి. ఇంతకే యింత గర్వమా ?

సీసమాలిక

కంస—హీనపూతనఁ జంపినానని పొంగకు
చాలఁద్రాళ్ళచె గట్టి చంపువైతు
శ్రీకృ—భక్తిత్రాళ్ళచె కట్టఁబడుదునెగాని నీ
బంధముల్ ననుఁగట్టి వైవఁగలవె
కంస—జలరాశిముంచి నిన్ బిలుకుమార్చెదకృష్ణ !
చచ్చితి వింకెందు చనఁగ గలవు ?
శ్రీకృ—జలరాశి మాయిల్లు, జలరాశి మామామ
ఆయబ్ధి నన్నేమి చేయఁగలదు ?
కంస—నీరూప మణగించి నీగుణంబుల మాన్పి
మదినిన్ను చింతల మానువాఁడ
శ్రీకృ—రూపమే లేదు నారూపు మాపెద వెట్లు
ఓమామ! నీచింత యుండదింక
కంస—కొండక్రిందనువైచి దండించి, ఖండించి
పరలోకసుఖముల నరయువాఁడ
శ్రీకృ—కొండక్రిందనె నేను నుండుదు నోమామ
పరలోకసుఖమె నీకరయనిత్తు
కంస—గీ. ఎందుదాగితి వొక్క—నీ విన్నినాళ్ళు
నిపుడు వచ్చితి నాకార్యమెల్ల దీరె
శ్రీకృ— నీదు మదిలోన నుంటి నే నిన్నినాళ్ళు
ఆర్తియేటికి నీ పనిఁ దీర్తుమామ !

కంస—బాలుడవు నీవు నాకు మారకుండ వౌదువని కొందఱు వచించిరి. అది యజ్ఞానవిజృంభితముగాని వేరుకాదు. నీవనగనేమి? నన్ననగనేమి? సంహారింతు వనగ నేమి?

ఉ. గోకులమందు నిన్ను మృతిఁగొల్పగ బాలకుఁ డొక్క-రుండు ని
న్నాకొనియున్న బెబ్బులిగ నంతకురీతినున్నవాఁ డనన్
వ్యాకుల మందితిన్ గనగ బాలుఁడ వీవిటు నన్వధింపుదే
ప్రాకటదంతఘట్టనల ప్రాణములన్ హరియింతుచూడుమా!

శ్రీకృ—దానవా! నీవు నాకు మేనమామ వయ్యును దానవకృత్యములం జేయుటచే "దానవా" యని సంబోధించెద. నిన్నొకఁడేల చంపవలయు? దినదినము నీవొనర్చు నీచతర పాపకార్యములే నిన్ను దహింప నేతెంచుచున్నవి.

ఉ. చంపఁగలేదు మృత్యు వది, చంపఁగలేడు పరేతనాథుఁడున్,
చంపగలేరు బ్రహ్మ హరి శంకరు లాసురసిద్ధసాధ్యులున్,
చంపఁగజాల రెవ్వియును; సర్వవిధంబుల నీదుకర్మయే
చంపును నిన్ను నందుకు విచార మదేటికి కంసభూవరా!

చ. చెలియలిఁ జంపుపాపము, ద్విజేంద్రులబాధలఁ జేయు పాపమా
పలువుర పాపల న్దునుముపాపము యజ్ఞము లార్చు పాప, మా
చెలువల బట్టుపాపము, విశిష్టుల హింసయొనర్చు పాపమున్
కలగక నిన్ను జంపు నది గాంచెద విప్పుడె తత్ఫలంబునున్.

కంస—బాలకా! నిన్ను జూడ నాకేటికో కరుణ కలుగుచున్నది. నీవు పసిబాలుడవు.నిన్ను జంపుదునా వలదా యని సందియము కలుగుచున్నది. ప్రథమాపరాధము గావున మన్నింతునా యని యూహాయుఁ జనించుచున్నది. నీ వెవ్వడవు? ఎచ్చట నుండి వచ్చితివి? ఎట్లు వచ్చితివి? చెప్పుము.

శ్రీకృ—కంసా ! ఏమి నాకు నీకూతునిచ్చి వివాహ మొనర్చెదవా నాబాంధవ్య మేల నీకు ? అప్పు డల్లుడు కానంటివి. ఇప్పుడు కావలసి వచ్చెనా ?

కంస—బాలకా ! ఇంక ని న్ను పేక్షింపజాల.

అనుబంధము 45

శ్రీకృ—కానిమ్ము. భవాదృశపాపనిచయ కంటకము క్షయమై యీ సుధ సుఖించునట్లుల జేసెద. ఇక మనినన్నాళ్ళు మనజాలవు ఇదె నీమనుగడ కంత్యము కలుగును. అంతట పరికింపుము

కంస—(దిక్కులుచూచి) ఆహా! ఇయ్యదియేమి మాయమో కా రాదుగదా ? నిజవీక్షణ పరంపరల శత్రువాహినీ సందోహ బులు మొదలంటగాల్చి మదీయరూపము శత్రునారీజనంబు గనులగట్టెను. నే నే దిక్కులు జూచిన, నేవస్తువు పరికించి నేనెందుల గాంచిన కృష్ణమయమై కాన్పించుచున్నది.

మ. ధరణిన్, వ్యోమమునం దిశావితతి నేత్రాజసాధంబునన్
గిరులున్, దివ్యతరంగణీ చయములన్, గీల్బొమ్మలన్, శాలల
దరుల నంధుల వస్తుజాతముల మద్వైరిన్ హరిం గాంచెదన్
అర రే ? చోద్యపుమంత్రవేత్తయితండాహా మోసమయ్యెన్గదా.

అకటా ! సత్యము దూలె మేనువణకంజొచ్చె కృష్ణా! కృష్ణ రాకుము ! రాకుము మేనమామనే ; భళి వచ్చితివా ! కాపాడుము కాపాడుము. దేవకీదేవీ ! నీవైన నీయన్నయందు కరుణింపుము

శ్రీకృ—రమ్ము నీకింక శాశ్వతసుఖ మొసగెదను. అని (మొదు కంసుని క్రిందబడవైచును.) (తెరవ్రాలును

[ప్రవేశము : నారదుడు, యోగమాయ, బ్రహ్మ,
ఇంద్రుడు మొదలగువారు]

ఇంద్రు—దేవా ! లోకములు చల్లనయ్యె, నీ దయావలోకమునఁ గృతార్థులమైతిమి.

బ్రహ్మ—గోవిందా ! నీకృపారస మెంతని కొనియాడవలయు ? భక్తులకై యవతరించిన లీలామానుషుడవై లోక కంటకులఁ బరిమార్చితివి.

యోగ—గోపాల నీయాజ్ఞానుసారమున కాళి, పోలి మొదలగు రూపములదాల్చి నీదర్శనములకై వేచియుంటిని. పరమపురుషుడవైన నిన్నుఁగాంచగలె. తమయానతిచే శుద్ధమాయా రూపిణియగు నాదిశక్తి, లక్ష్మీదేవి భీష్మపురి యందు రుక్మిణీ నామమున జనించి యున్నది.

నార—దేవాదిదేవా! పుండరీకాక్ష! వాచామగోచరుండ వగునిన్నుఁ గాంచగల్గితిమి. ధన్యులమైతిమి, కృతార్థుల మైతిమి.

యోగ—సీ. దండంబు బ్రహ్మాండ పుండరీక కరండ
మండిత నాభీప్రభాండ ! నీకు

బ్రహ్మ—జోహారు వైదేహ భాహారిహృద్గేహసా
హార్ద్రివ ర్తనోత్సాహ నీకు

నార—వందనం బరుణేందు సుందరేక్షణ బృంద
వందితహరి సదానంద ! నీకు

ఇంద్రు—జేజే బుధాజీవ రాజీఘనాజీవ
రాజత వారిదరాజి ! నీకు

నార—గీ. ప్రణతి నికురంబములు దివ్యభామ ! నీకు
పరమసాష్టాంగములు చక్రపాణి నీకు
నిరుపమాంజలులు పరమపురుష ! నీకు
వరనమస్కారములు గోపబాల ! నీకు

[ప్రవేశము : దేవకీ వసుదేవులతో నక్రూరుడు]

దేవ—(కుమారు నాలింగమునఁ జేసికొని) కృష్ణా! కృష్ణా! ఎన్ని దినములకు నిన్ను గాంచఁగల్గితిమి ? ఎంత కాలమునకు 'తనయా' యని సంబోధింపఁగలిగితిమి ! ఈ దినమేకదా సుదినము ? అన్నా ! గోకులబాలా! నీతల్లిని గంటివా ?

శా. అన్నా ! గోకులబాల ! మామక తపస్సామోదలీలా! నినున్
గన్నారన్ గనుగొంటి నేఁడు మది సత్కాంక్షా ఫలం బబ్బెఁగా
ఎన్నాళ్ళాయెను నిన్నుఁ గానక కృపాహీనాత్మనై క్రోసితిన్
అన్నా! నీ జననిన్ క్షమింపవె దయాహాసంబునన్ బ్రోవవే.

వసు—తనయా ! నిను గాంచు కుతూహలముననే చెఱసాలయందుఁ గనరాని కష్టములొందియైన జీవింపగంటిని. రేపల్లెయందు నీ కుశలవార్తల విని యెపుడు నినుగాంతుమో యని దినమొక్క యుగముగా గడుపుచుంటిమి. నేఁడు నీదివ్యరూపము కంటిమి. మావంశభూషణముఁ గంటిమి.

ఉ. కంటిమి భాగ్యకల్పకము కంటిమి పున్నెముప్రోవు నిమ్మగా
కంటిమి వంశభూషణము కంటిమి కామిత కామధేనువున్
కంటిమి మానిధానమును కంటిమి మాదగుముద్దుకృష్ణునిన్
కంటిమి జన్మపావనత కల్మషనాశన ! కంజలోచనా!

శ్రీకృ—జననీ జనకులారా నాకొఱకై యెంతయో శ్రమించితిరి. నా కొరకై కడుసిడుముల బడితిరి. అక్కటా ! ఇంత వఱకు మిమ్ముల గాంచ నేరకపోతిని. నా తల్లిదండ్రుల నేఁడు గాంచఁ గంటి అమ్మరో! హతభాగ్యుడగు నన్ను నందనునిగా బడయుటచే నెంత దరిలేని దుఃఖసముద్రమున మునిగితివిగదా ?

సీ. హతభాగ్యుఁడగు నాదుకతమున కడలేని
కష్టము లిందాకఁ గంటివమ్మ ?
జనకులసంతాపఘనుల జేసిన క్రూరు
కొమరుఁ జూడగ నేల కోరితమ్మ ?
తండ్రులగాక నాతమ్ముల హింసించు
కలుషుని నన్నేలఁ గంటివమ్మ ?
అమ్మరో! యిన్నాళ్ళు నెమ్మి తల్లినిఁజూచు
భాగ్యహీనత యుండ వలసెనమ్మ ?

గీ. కన్నతల్లిని నేడు నే కంటినమ్మ
కనుల కెంతయు పండువు కలిగెనమ్మ
ఘనత నాకోర్కె ఫలియింపఁ గంటినమ్మ
జనని ! నన్నింక పాలించి సాకుమమ్మ.

(అని తల్లిదండ్రులకు నమస్కరించును)

నార — బ్రహ్మాదులారా ! ఇట్టి సంతోషసమయమున నీ దేవదేవుని గోవిందుని, నంద నందనుని స్తోత్ర మొనర్చుచు మంగళము పాడుదము.

అనుబంధము 46

# అనుబంధములు

## 1 కాఫీరాగము—రూపకము

అందఱు—వనధివాస-మాధవా - ఘనా ఘనా - ఘనా
భవరశీల - శ్రుతివిలోల - జలజలోచనా
వరదా - నా - రా - య - ణా భక్తపాలనా॥

## 2 బేహాగురాగము—ఆదితాళము

భూదేవి—ఆలించి పాలింపవే - నామొఱ
ఈలోకమున్ బ్రోవవె - ముకుంద - ముకుంద ॥ఆలించి॥
పాపులచే నతి - బాధలఁ జెందితి
బ్రాపిచ్చి రక్షింపవే - ఏపారగా నను
కాపాడవే - వర సద్భక్తసంరక్షణా ॥ఆలించి॥

## 3, 1—వ పాటయే

## 4 శంకరాభరణము—రూపకతాళము

అందఱు—సంత - సంబు - నెంతో - నిండెగా
మదిలోననూ - భాసురగతి - కర మరుదుగ ॥సంత॥
బ్రహ్మ—శ్రీ - నా థుం - డున్ - బ్రోచున్ - మమ్మున్ ॥సంత॥
ఉగ్ర—దేవకి - నీపతి - తోడను - దీపిత-మోదమునందుము ॥సం॥
వసు—కాంతా - యీధరణిన్ - ఎంతో - వరయశముఁ - సం
తోషము వెలుగున్ - ఘనతన్ - సతిగ - నతివ - నినునే
గనుటను ॥సంత॥
దేవకి—మేలాయే-నినుపతిగను నే గాంచన్-నిరతము నినుసేవింతున్
ఘనకరుణను పాలింపు-సారశుభం - బారయుచున్ - ధీరమ
తిన్ - బ్రోచు మమున్ - సరసిజనయనుఁడు నెప్పుడు ॥సంత॥

కంస—అమ్మా! రమ్మా? - యశమును చేకొమ్మా - కొమ్మా
సమ్మో - దము నిటు గైకొమ్మా - పొమ్మా పొమ్మా -
తనయునితో రమ్మా - నీపతితో - దీపితమా - పతివ్రతా
ప్రభావమునే నిత్యంబు గైకొమ్మా ॥సం॥

5 ఇంగ్లీషునోటు—ఏకతాళము

సైనికులు—చనుఁడందమార - సురల్ చెండుబార-ధరన్ యేపు
మీర - అరుల్ దారిపార-మహాధీరులారా - మదిశూరతన్
మీరగ-తారలు-వ్రాలగ-ధారుణి సోలఁగ ధీరులారా ॥చను॥
చంద్రుఁడా యుపేంద్రుఁడా-మహేంద్రుఁ డేచినన్
నొంచి-వధించి-ద్రుంచి-సంచ-రింపుఁడీ-కంసనా
మమున్ వినిన-కనిన-జగములెల్ల తల్లడిల్లగా॥

6, 7 బేహాగ్ రాగము—పంజాబితాళము

నార—సురవరనుతచరణా-స్వరమణా
కరివరావనా-సరసిజనయనా
ధరణి ధరోద్ధరణా - నిగమనా ॥సుర॥
మత్స్యకూర్మ - కిటి నృసింహ - మాణవక భూభృద్వరామ
దానవారి - రామచంద్ర - దీనానుతభరణా॥

8 ధీరశంకరాభరణ రాగము—ఆటతాళము

నార—జయజయ-కంసరాజేంద్రా - జగన్నుతకీర్తి - గుణసాంద్రా
జగన్నుతకీర్తి-గుణసాంద్రా - జగన్నుతకీర్తి - గుణసాంద్రా
దురాసద-వైరిసమవర్తి -ధరాధరధైర్య- విస్ఫూర్తి ॥జయ॥

9 బిలహరిరాగము—ఏకతాళము

కంస—కానవా-నారదా-నాశక్తి-నాయుక్తి-నావ్యక్తి-నారక్తి॥ కా॥
జగంబులన్-తలంగన్ చేయు టెఱుఁగవే
యేటికి - మాటలు - మాటికి - భీతియు - లేకిటు బల్కితి
జ్ఞానము చేటుగ ॥కానవా॥

10 (3-వ పాటయే)

11 ఇంగ్లీషునోటు—ఆదితాళము

కంస—ఇదె వెళ్ళెదన్ ఇలనొందెదన్ - చెండాడెదన్ - అరివార
మున్ విష్ణున్ గిష్ణున్ - భ్రష్టున్ జేతున్ - రుద్రునింద్రున్
గావింతున్ ॥
యశంబెల్లన్ - వెసన్ - మీరన్ - సురల్ పారన్-ధరన్
మీరన్-భూరిత్రివిక్రమ - విక్రమ మెప్ప ప-రాక్రమ మహా
లక్ష్మిని నొందెదను॥

12 జంఝూటిరాగము—ఏకతాళము

వసు—వనమెంత-వింత - సంతతంబు నించెగాదె- నీరేజనేత్రి ॥వన॥
దేవకి—సురసాలసాల - నారికేళముల్ - మీరెను నాథా ॥సుర॥
వసు—అరవిం - దములం - దులవిం - దుగతు - మ్మెదలున్
దేవకీ—మదియందమున్ - కుదురందగన్ - మధుబిందులన్
తగ గ్రోలగ
వసు—కాసారముల్ - కాసారతిన్ - ధీరంబులై - రాజిల్లెగా
దేవకి—శుకపికంబులున్ - సురుచిరంబులై - వరరుతంబులన్ - ధర
చెన్నారెగా॥
కదలీ - దళలీ - నముతో - కపురం - బలరేనుగద ॥సుర
వ—సుమసముదయములు నెల్లంమిక - ప్రమువము నమరగ నె
వ్వేళన్ - వసురభవత తనరెన్ గా-సరసిజముఖిగనుఘనరీతిఁ
జలముల్ - గిరులన్ - పరగన్ - కలికి పలు తెఱగుల ॥వన॥

13 సారంగరాగము—ఆదితాళము

కంస—వదలనే చంపక - పగతురన్
కరుణతలపక - కాంతినిడక - వంతగనక నొంచెనె - చెలియ

లైనసే మల్లనశాత్రవుఁ - డుల్లసమారగపుట్టడే - ఉల్లము
నందుల-నొల్లను|ప్రేమను-తల్లడమొందగఁజేయునే - బాయనే
దేవకీ

14 కమాచ్ రాగము—ఆదితాళము

దేవకి—నన్ను నేలవే - అన్నా కృతచేత
కన్నారనన్ను - మన్నించియింక - యిన్నాతి చూచి॥నన్ను॥
చెల్లిలిని చంపగనిటు నుల్లంబు నొప్పనౌనె - ఉల్లాసమంతలో
కల్లల నమ్మి వంత వెల్గొందఁ జేయకు ॥నన్ను॥
వసు—చెన్నార ప్రేమను - సుపన్నారవిందనేత్రి
చిన్నారిసోదరి - నీవెన్నంగ. - చంపయిటు - అన్నాతగవౌన
॥చెన్నార॥

15 ధన్యాసిరాగము—ఆటతాళము

దేవకి —కరుణాత్ములిల కలరే - అరసిబ్రోచు వారెలేరె
చెరసాలఁబడి - శోకా - కరులెత్తి మకటకటా ॥కరు॥
కంసుడు కులపాంసనుండయి కన్నపుత్రులఁ జంపెనయ్యో
వంశనాశమయ్యెనాహా - వంశాకర నీరజాక్ష ॥కరు॥
తొలిజన్మమున నేను బాలు రెందఱిఁ జంపితినో
కలుషకృత్యముఁ జేసినానో - ఆ పాపము మాననౌ ॥కరు॥

16 లావణి

గోపాల - బాలసుర - లాలనలోల - కృపాకర-సద్గుణశీలా-
గుణశీలపాల - మునిజాలహృదుజ్వల-సుందర - భాస్వరఫాలా
గోవింద-గోవింద ॥౧॥
గోవిందనందపర - నందన-నందదమంద - విబంధనబృందా—
బృందవనసుమ - రందబిందుచయ - సుందర చరణానందా—
ఆనందా ఆనందా

శ్రీసంగర - రంగ - విమలాంగ - సుభృంగ - సురంగద
సాంగ - తరంగా - తరంగ - రంగ- ధవళాంగ - భుజగమ
సంగత సంస్ఫురి- తాంగ స్ఫురితాంగా - స్ఫురితాంగ ॥3॥

17 ఆనందభైరవి రాగము—ఆటచాపుతాళము

దేవకి, వసు—బాలా మమ్మిటుబాసి చనెదే- మరల నిన్నుగాంచగ మాకు కలదే ॥బాలా॥
పున్నమచందురు - బోలు నీమోమును, యెన్నడు గన నున్న వారమొ -కన్నతండ్రిరో ముద్దుబాల ॥బాలా॥
సుకుమార మాభాగ్య - మకలంక మనియుండ - వికలరీతిని- నకట-నిన్నిటు - ప్రకటవనములఁ ద్రోలుటాయె ॥బాలా॥

28 సారంగరాగము—ఆటతాళము

అందఱు—శ్రీకంస - రాజచంద్ర - ధైర్యసాంద్ర ॥శ్రీకంస॥
లోకచక్ర - విక్రమాఢ్య - వక్రదేవ - దండధర కరుణా - నతజనభరణ ॥శ్రీకంస॥
రాజరాజ సార్వభౌమ - రాజచూడ - దివ్యప్రేమ - రమణా జన చయభరణా ॥శ్రీకంస॥

19 ఝంఝూటిరాగము—ఆటతాళము

దేవకి—కావు కావు రాజేంద్రా
అలుకేల - కో ॥కావు॥
కనకోడలాగదా - కనికరంబు చూపుమా
తునుమన్ - పాడియే ॥కావు॥

10 బేహాగ్ రాగము—ఏకతాళము

కంస—చండశాస - నుండ నేను - కనకవినక
పలుకవలదు కినుక పొడమిన
అల్లుఁడైన చెల్లెలైన - పెల్లుశత్రు లైనవారి
భిలుకుమార్చి-బలుకుమార్చి-కలత కోర్చి-నలదెదఁ ॥చండ॥

21 ఇంగ్లీషునోటు—ఏకతాళము

కంస—పలువా - తులువా - నకవా - గనవా
తెగవేయుచు నిన్ - పగదీరన్ ॥పలువా॥
కలుషం బడరన్ - పలుకన్ దగునే ॥పలువా॥
వైర మొదవఁగ నిట్లాడన్-మీరిమదమున్ నణగింతున్
నీదురుధిరము నింతింతన్ - నిక పారింతున్ ॥పలువా॥

22 హిందూస్థాని భైరవిరాగము—రూపకతాళము

కంస—ఇదేమిచిత్రమో -మహానుతాపమో
మదీయశక్తితూలెనో - విశారమో
చిన్నశిశు - మిన్ను కెగసె - ఎన్నఁజాలనే
ఏమి సేతువో - శోకం - బాయెన్ ॥ఇదేమి॥

23 కమాజురాగము—ఏకతాళము

యశో—రారగోకుల - సుందర రారా - యిందిరవర రార
బిరబిర - యిందిరవర రార - బిరబిర యదువీర ॥రార॥
వరగుణజాలా - సురచిరఫాలా - సురనుతఘనలీలా
రారనందన - యదుకులబాల - వరదగోపాలా
బిరబిర వరద గోపాలా ॥రార॥
శుభ్రఖ్యాతిని - సుబ్రహ్మణ్యా - సుకవిని నేలుటకు రాగదే-
సుక - విని - నేలుటకు - సుజనపోషణా - సుభకర రార
సరసిజముఖ రారా - బిరబిరా

24 మధ్యమావతిరాగము—ఏకతాళము

యశో—జో జో జో - ముద్దుగోకులబాల
జో జో జో - సురుచిరఘునశీల ॥జో॥
లాలిసద్గుణ - మణిగణజాల - ఇందిరాముఖ - పంకజలోల
సుందరాంచితా - శశినిభఫాలా - ధీరమునీశ్వర-సముదయ
పాలా ॥జో॥

సుగ్రీవాభయము - నొసంగినరామ - ఆ వాలిని మదమణచిన రామ ॥సుగ్రీవా॥
వానరసేనలు జలధినిఁ జేరి - వాసిగ సేతువుఁ గట్టఁగమీర
పూని వేడిన గరువముమీర-సాగరమంతయు పొంగుచుమీరె॥

25 బేహాగ్ రాగము—ఏక తాళము

శ్రీకృ—లక్ష్మణా - ధనువు నిటు - కొని తెమ్మా
దివ్యబాణములనీ - వందిమ్మా ॥లక్ష్మణా॥
జలధిని నొంచెద- లలిశస్త్రములకా - కలుష మొనర్చెను -
కరుణను చూపక - కాలము తీరిన - దందిమ్మా-వీనికాలము
తీరిన - దందిమ్మా ॥లక్ష్మణా॥
ఎంత నే వేడిన - నెనయుచుమార్గము - వింతగ నివ్వక-వేడుక
సల్పెడు - అంతముచేతును - చేకొమ్మా - వీని నంతముఁ
జేయుదు చేకొమ్మా ॥లక్ష్మణా॥

26 వ పాట

ఉద్ధవ—గోపతనయ - సుగుణచయ
ప్రోవు మమ్ము - శుభ మొనయ
కోప ముడుగు - మునినిలయ - వరసదయ శ్రీ ॥గోప॥

శ్రీకృ—నెమ్మభయమువలదు గన-మోద మొదవుభక్తిఘన,
రాముడంచు తలఁచితినా జగదవన శ్రీ ॥నెమ్మ॥

27 యదుకులకాంభోజి రాగము—అట తాళము

పూతన—ఈజగముల నాపేరన్న - బెగ డొఁదరె నన్ను గన్న
నగరములు నగములు పగుల ॥ఈ॥
ధరణీసురులు వర తరుణీజనులు ధర - కరకర -
బడుచును - బరుగిడనా - దృష్టిగన్న - నెట్టివారు
తట్టుకొను వారలే - పట్టివారి - నట్టెచంపు
నట్టిజగ జెట్టినే నాదు. ॥ఈజగ॥

28 బేహాగ్ రాగము—అటతాళము

పూతన—ననుఁజూడలోకులు-ఘనమోహా - మును నొంద - లేరే
చేరరారే - వేడలేరే - పొందరారే ||నను||
కులకుల - తళుకుల - బెళుకుల గాంచి - హరియైన వేడఁడే
వాల్గంటిచూపుల - వలలోనఁ జేరి - హరుఁడైన వేడఁడే
జను లెంతటివారలు ఆ - మును లెంతటివారలు ఆ -
ఘనమోహిని నౌదునుగా

29 కాఫీరాగము—ఏకతాళము

యశోద—ముద్దాడ - గలుగునదియేగా
మోదభాగ్యా - మిలలోన ||ముద్దాడ||
చేరికుమారుల - చెలువముగాంచి - మీరిముఱిపెములనించు
పలుకులు వినుచును - వరముదమునుగని - సురుచిర - తన
యుల నెంతో - పరమాదరణన్ ||ముద్దాడ||

30 బేహాగ్ రాగము—ఏకతాళము

శ్రీకృ—భళి - నాలీల దెలియంగ - నెవ్వారలున్నారకో ||భళి
పసిబాలుండనై - బలువేసంబులన్ - వరనందాదులకా
వడినాడించుచుకా - నాటకమునాడును - లోకంబునేలు
దున్ గదా ||భళి||

31 మోహన రాగము—ఏకతాళము

యశోద—రమ్మానాసుం - దరముద్దులకృష్ణా - చేరఁగ
వలపులనించుచు - చెలువము గాంచుచు
వరలోకమోహకరలోచనా ||రమ్మా||
తేనియలొలికెడు - తియ్యనిపలుకుల
మానకముద్దుల - నొసఁగుచు తనయా ||రమ్మా||
మౌక్తికహారముల్ - బాజుపై వెలయఁగ
ముఱిపెము పెంచెడి - రాజగోపాలా ||రమ్మా||

## 32 పీలురాగము—ఏకతాళము

శ్రీకృ—అమ్మ యిటుబంగారు - బండి నా కియ్యవే ||అమ్మ||
బండినియ్యవే - గుఱ్ఱంబునియ్యవే
బండినెక్కుదు - ఏనుగునెక్కుదు చొక్కుదుక్లిక్ క్లిక్
మెల్లంగ - మెల్లంగ, సర్ - సర్ - సర్ ||అమ్మ||
బంగారు అంగీలు - సొంపారు టోపీలు
ఇంపారవిల్లంది - యుద్ధంబుచేసేను - కొట్టేను - ఫట్ ఫట్
వీరుండ - ధీరుండ - సై - సై - సై ||అమ్మ||

## 33 శ్రీరాగము—ఏకతాళము

బాలు—సంతసము - నిండారగా - బంతులాటలాడుదము
అదెబంతి కనుమింక - అనవేగ విడిచెదను ||సంత||

1 బాలు—అందఱు-కొనుండుదీని - కుందగ జేసెద-చిటికలోన ||సంత||
ఉద్ధ—చూడరాగరువమేల - చెండునుపట్టెద - వేడుకలర ||సంత||
శ్రీకృ—వృక్షముల్-తనర నెక్కి—వేడుక నాటల-నాడుదము ||సంత||
2 బాల—కాతరం - బేలదాగిమూతలనాడుద - మిందుజేరి ||సంత||

## 34 తోడిరాగము—ఆటతాళము

శ్రీకృ—రారా రాజునునేనైతి - లేరా
నన్నిటుసేవ చేయంగ రార ||రారా||
మీరిలోకమేలగా - ధీరతపుట్టినవాండరా
చెన్నుమీరనాడు మన్నంబునొంద నెన్నిమీరలింక నన్ను
జేరియుండ సన్నుతింపుడెల్ల వేళ ||రారా||

బాలురు—దేవా -లోకాధీపాలుండ - వీవ
వేదాంత వేద్యుం డీవకావ ||దేవా||
దేవమార్గము నేలవా - మానులెల్లర బ్రోవవా

నిన్ను నెన్నఁజాల-మన్న మమ్ముపాల - నమ్ముచేయ లీలలెన్న
వేఁడువార - మన్నమమ్ముఁబ్రోవవేలా - గోపబాలా ॥దేవా॥

35 బేహాగ్ రాగము—ఏకతాళము

చందు—వైరంబుమీకింత - సేయుటతగదు
క్రూరంబుచూపుట - మేలుకాదు ॥వైరంబు॥
కమ—సరివైరముమాకేమి - లేదులేదు
పద్మ—వట్టినేరముమోపుట - సరికాదు
చందు—అమ్మ నీ విట్లు - చేయరాదు
రక్తాక్షి—వీరిమాటల - నమ్మరాదు
పద్మ—, కమ— } భళీరే, భళిరే, భళీరేనీమాట భళిరేమెచ్చేరుగా
రక్తాక్షి—ముయ్ నోర్
చందు—ఛీ-పో ॥వైరంబు॥

చందు— చెంగావిపావడ - నే తెచ్చియిత్తుగా - శంగారుకడియాలు
చేయింతుగా ॥చెంగావి॥

పద్మ—, కమ— } పుట్టువైరంబు మాకెట్లు - తప్పునుగా
రక్తాక్షి—గట్టిపోరకతో కొట్టినతప్పునుగ
చందు—మీతో కష్టంబు వచ్చిందిగా
రక్తాక్షి—తలకెక్కించు కొన్నావుగా
పద్మ—, కమ— } పోవే - పోవే - పోవే - పోవే నీమాటసాగదుర
రక్తాక్షి—ముయ్ నోర్
చందు—ఛీ - పో ॥వైరంబు॥

36 బేహాగ్ రాగము—ఏకతాళము

శ్రీకృ—నను - నల్లుండు తనయుఁడు - నంచందరున్నారుగా
ఘనమోహం - వీరికి కల్పించితి
వెన్నపాల్మీగడల్ - యెల్లవారిండ్లలో
వాసిగనేదీసికొని - క్రీడించి మీరుదున్ గద ॥నను॥

37 కాపిరాగము—ఏకతాళము

యశోద—నిన్నింక సైరింపరా - తుంటరికృష్ణ ॥నిన్నింక॥
నీచోరతనముల- నీతుంటరితనముల మన్నింపక నికమీఁద
వినుము కనుము - మదిని నింక ॥నిన్నింక॥
ఇల్లిల్లువెదకినే - నెంతెంతో - యలసితి
నేమన్న విడనింక - తిట్టికొట్టి - కట్టివేతు ॥నిన్నింక॥

38 జంఝూటిరాగము—ఏకతాళము

శ్రీకృ—అసత్యమీపలుకు - వినోదం బసత్యమీపలుకు
అమ్మరో - అబద్ధమేయగుగా వినోదం ॥అసత్య॥
మన్నుఁదినను, నమ్మరొ వెఱ్ఱినె - మన్నింపన్ వలదే
యశోదా ॥అసత్య॥
భూమికి నాకును - ప్రేమము నిక్కము - ఈమాటెక్కడిదే-
యశోదా ॥అసత్య॥

39 శంకరాభరణము—ఏకతాళము

యశోద—నిలునిలుబాలక - యెందులకటిగెను-కట్టెదను నినుకొట్టె
దను చెలగకుమా - కలంగకుమా - పలుదోవలపా - రగ
నేలను ముద్దులకృష్ణా ముద్దులకృష్ణా ॥నిలు॥
శ్రీకృ—దయగనుమానను - తల్లిరొవలవదు - కట్టకుమాననుకొట్ట
కుమా మన్ననచే నెన్నవె నక-ఎన్నఁడు తప్పుల నేచేయను
నను కట్టకుమా ననుకొట్టకుమా ॥దయ॥

40 మోహనరాగము—ఆదితాళము

గంధ—నంద - నందన - ఇందిరావరా - యిందు బ్రోవుమా॥
సుందరార - విందలోచన - బంధమోచనా
మానిశాపము - బూనియిట్టుల - హీనులైతిమి ॥నం॥
కాననార్జున - తరువులైతిమి కంటి మీకృపఁ
నీదు - పాద నీరజాతము - లాదరంబున
మాదుమదిని - పాదుకొలిపి - మనుపుమాధవా ॥నం॥

41 ఖరహరప్రియరాగము—ఏకతాళము

శ్రీకృ—ఔర - శారదచంద్రుడలరెను—ముదమార ॥ఔర॥
కైర - వములను మీరగజలజ - వారమునారగ
రాజిలెను గదా ॥ఔర॥
చోరజారులు - పారగశృంగార రవము నించుచు - మోద
ము పెంచుచు - భూరిప్రేమ నిండ ॥ఔర॥
సాధుమాన - సమ్మురీతి - చల్లదనమువిలసిల్ల - కలువప్రేమ -
కళలధామ—కలితభూమ - ఈచందమామ - ఆకసంబునందు
వికసించేగ ॥ఔర॥

42 జోగిసావేరి రాగము—ఏకతాళము

గోపి—రారెముదం - బారకృష్ణుఁ - జూడగా కోరికలింపారగా -
సుదతులారా - కోరికలింపారగా ॥రారె॥
సరోజనేత్రునిన్ - సరోజనాభునిన్ సరోజజాంచితుఁ
సరోజజార్చితున్ ॥రారె॥
భామరో మా - భాగ్యమెల్లమీరగా - భక్తియుసొంపారగా
వనజముఖీ - భక్తియుసొంపారగా ॥రారె॥
వినోదశీలుఁడే - మనోహరాంగుడే - వేణుగోపాలుఁడే - వేద
వేద్యుఁడే ॥రార॥

మనసెల్ల కృష్ణుని - యందునివలె - మన్నాథు కడ కేగుదుము
లలనా - వెన్నునిశరణొందుదము - కలికీ - సమ్మోదమును
నొందుము ॥రారె॥

43 మోహనరాగము—రూపకతాళము

గోపి—సారసలోచన మోహారి - వరతాపసజాలలోల ॥సారస॥
యదుబాలా శ్రుతిజాలా - మృదుఫాలా శ్రీధవనీ-పరమకరుణ
భక్తినొసగి - అరసిమమ్ము - బ్రోవు దేవ ॥సారస
గోపాలాకరుణజూపి - పాపములన్నియు బాపి మోక్షపదవి
మాకునొసగి - మనుపుము నోవాసు దేవ ॥సారస॥

44 సావేరిరాగము—రూపకతాళము

యశో—శుభముమీరగా-మధురకువేడ్క—చనుమాతనయ ॥శుభ॥
శ్రీకృ—మనం - బులో - నశో - కమే - లనోజననీ
పోయివత్తునా - కనుమతినిచ్చి - వలదె ॥మనం॥

యశో—గోవింద నినుగనుచు నానంద - మునుగనితిని మోనంద -
నినువిడన్-భరమయ్యెన్ ననటచేన్-మనసున గన ॥శుభ॥

శ్రీకృ—మనో - వ్యసనమేలకో - జననికో వెసన్-మరల నిన్ - కనె
దనుగద ॥మనం॥

యశో.—పీ-మురిపెంపుపలుకుల నెపుడునువిందున్ - దినదినమున్
మనమున నీ-గుణములనే ఎట్లుగా-మేమున్ మరతుము ॥శుభ॥
శ్రీదయితొందు శుభమిచ్చున్ - ఆమోదము గలుగునుమార్గ
మునన్ - ఘన - యశ - మున - మరి - మము గనువర
సుగుణమణి - కరుణగని ॥శుభము॥

45 ఇంగ్లిషునోటు—ఏకతాళము

కంస—ప్రబలఖడ్గధారనీరంబుఁ జీల్చెద - చీల్చెదన్ - చీల్చెదన్
బ్రతికిపో - లేవుబాలకా - ఈనాడున్
నినుధరబడనలచి - మించెదన్ - మించెదన్ - మించెదన్
వైరంబారన్ - పోరినినుజంపన్ - భారమంతయువేబాయున్
వీరుఁ డౌచు వెలసెదన్ - దక్కవింక బాలకా - బాలకా
బాలకా ॥ప్రబల॥

46 మోహనరాగము—ఏకతాళము

కమలా - నాథా విమలవిభా-కమలా - వాసా - కలుషహారా
ప్రముదా - భాషా వరఫలదా - కమలా - నాభాఘునకరుణా
కరివరదా - సురవినుతా - హరివదనా - మురహరణా -సుర
చిర నార - దాది - వంద - నీయ శ్రీ ॥కమలా॥
నామలోలా - సాధుపాలా - వేదలీలా సారశీలా-భానుజాలా
మందరధారణ - మానివిభావన - కారణ సత్కరుణా-సూ-
త్రబ - హ్మే - శ్యా - వందితా.

మంగళం

***